ఓమ్

శ్రీ మహాగణాధిపతయే మేధా దక్షిణామూర్తయే చ నమః

# శ్రీ శివ మహాస్తోత్రము



అనువాదకులు, ప్రకాశకులు,

నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు

…సరజ్యేష్ఠబహుళ సప్తమి, గురువారము

7-7-1988




సర్వస్వామ్యము]                [ఐదు రూపాయలు

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ శివమహాస్తోత్రము



అర్థసహితము

శ్రీ నీలకంఠ భాష్యాంధ్రానువాదాది బహుగ్రంథకర్తలు, గౌతమ సగోత్రికులు, శ్రీమల్లికార్జున పండితారాధ్యవంశీయులు, శైవమహాపీఠ ఉపాధ్యక్షులు, శివశ్రీ॥ నిర్మల అన్నపూర్ణాంబా రామనాధారాధ్య తనయులు శ్రౌతశైవులు నగు శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులచే అనువదింపఁబడి సమూలముగ ముద్రింప జేయఁబడినది.

[ప్రతులు 1000]

[వెల రూ॥ 5-00

వెల ఐదురూపాయలు

వలయువారు





శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు

సర్వమంగళాసదనము

184/A. వెస్ట్ మారేడుపల్లి సికింద్రాబాద్-500 026 **(A.P.)**

# ముందుమాట

శివపురాణము మహాపురాణమని "శ్రీ శివమహాపురాణ ప్రామాణ్య ప్రశంసా విశేషములు" అను నా విరచితగ్రంథములో ప్రామాణికముగ యుక్తియుక్తముగాను నిరూపింపఁబడి పండిత ప్రకాండుల మెప్పు బడసినది.

శివమహాపురాణములో ఏడవదగు వాయవీయ సంహిత-తలమానికముగా తనరారునట్టిది ఉపమన్యు మహర్షిగారు-శివమహాభక్తులలో అగ్రగణ్యుఁడై శివుని దర్శించి ఆనందముతో నుండగా శ్రీకృష్ణభగవానుఁడు ఉపమన్యువు నాశ్రయించి 'శివయోగములలో శ్రేష్ఠమైనదాని నుపదేశింపుడని' ప్రార్థింపగా-ఉపమన్యుమహర్షి-ఈ శివమహాస్తోత్రమును పఠింపవలసినదని యుపదేశించెను. స్తోత్రమును పఠించువారు- సకలదేవతాస్తోత్రఫలమును పొందవచ్చును.

గాన నిట్టి స్తోత్రము పదునేడు (17) మహాపురాణములలో లేదనియే చెప్పవచ్చును ఇందు పరశివుఁడు, ఆదిశక్తి, సదాశివుఁడు, సద్యోజాతాది పంచబ్రహ్మలు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, ఇంద్రాద్యష్టదిక్పాలురు, నవగ్రహములు పార్వతీ లక్ష్మీసరస్వతులు. నారదాది మహర్షులు మరియు ముఖ్యులందరును ఐదు ఆవరణములలో నుతింపఁబడిరి.

శివభక్తులేగాక దైవభక్తులందరును పఠింపఁదగినది. స్తోత్రము శ్రీ వేదవ్యాసులచే ఉపమన్యుప్రోక్తముగా రచింపఁబడినందున-దానికి తెలుగు సేత యవసరమని వ్రాసితిని.

చదువరులు నా ఈ శ్రమను సార్థక మొనర్తురుగాక!



గ్రంథకర్త
శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి

శ్రీ మహాగణాధిపతయే నమః

ఈ గ్రంథం ప్రింటుకోసం విరాళాలు సమర్పించిన మహోదారులు

# (1) శ్రీ పేకేటి నారాయణమూర్తిగారు, వైశ్యులు.

(తండ్రి పేకేటి వీరరాఘవరావుగారు)

ఉద్యోగం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (క్యాషియర్)

నివాసం :- ఎ.డి బి. బండారులంక, 533221. అమలాపురం తాలూకా.

శాంతకుల గోత్రమునందు జన్మించిన శ్రీ పేకేటి నారాయణమూర్తి గారు నాకు దైవికముగా సుపరిచితులై అడుగగానే వెనుకంజ వేయక గొప్ప విరాళము నొసగిరి. సహజ శివభక్తి పరిపూర్ణులై ఇంటి ఇలవేల్పగు భద్రకాళీసహిత శ్రీ వీరభద్రస్వామివారి కృపచే పునర్జీవితము నొంది బ్యాంకు ఉద్యోగమును సుస్థిరము జేసికొనిరి. పరమేశ్వరునకు పార్వతీదేవి వలె వీరికి ధర్మపత్ని మహాలక్ష్మి లభించుటయేగాక ఒక కుమారుడు చి॥శ్రీ॥ హరకామేశ్వరరావు, ఒక కుమార్తె శ్రీ రజని అను పేరులతో పెంపొందుచున్నవారు. శివానుగ్రహమువలననే సంకటములన్నింటిని పారద్రోలి ప్రస్తుతము సుఖమయ జీవనమును సాగించుచున్నవారు.

వీరికి వీరి కుటుంబమునకును పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్య భాగ్యములను ప్రసాదించి సదా రక్షించుగాక!

(2) శ్రీపతి వేంకటసత్యనరసింహమూర్తిగారు

(3) శ్రీపతి ఉమాపతిగారు

వీరిరువురు సహృదయులు పరమమిత్రులునై గొప్పవిరాళమును సమర్పించిరి.

1-3-183/40/186, S.B.I. కాలనీ, న్యూబాకారం, హైద్రాబాద్.

(4) శ్రీ ఉత్తూరి రాజయ్యశ్రేష్ఠిగారు,

న్యూబాకారం, హైద్రాబాద్.

(5) శ్రీ కె వి.యస్.యస్. మల్లికార్జునరావుగారు, శీల.
శ్రీమతి కొత్తలంక సత్యవతిగారిపేర విరాళముపంపిరి.

(6) శ్రీ సింగరాజు శేషగిరిరావుగారు, బి ఏ.
15/126, జిల్లాకోర్టురోడు, మచిలీపట్నం-521002.

(7) (శ్రీ విద్యాసాగర్ హైస్కూలు) హరగోపాలరావుగారు
అడ్డగుట్ట, నార్తులాలాగుడ, సికింద్రాబాద్-500070.

(8) కీ॥శే॥ శివశ్రీ॥ ముత్యంపేట చెన్నబసవారాధ్యులవారి జ్ఞాపకార్థము-
వారి కుమారులు శ్రీ గంగాధరశర్మ, రాజేశ్వరశర్మగారలు, (1)
న్యూ మిర్యాలగుడ, సంతోష్‌రెడ్డికాలనీ, 14-159, మల్కాజిగిరి,
సికింద్రాబాద్ (2) 1-3-1039, కవాడిగుడ, శంకర్‌బాగ్,
సికింద్రాబాద్

(9) శ్రీ అత్తెవెల్లి నారాయణగారి కుమారుడు
భద్రయ్యగారు (పరమశైవులు, వైశ్యులు)మరియు శ్రీమర్యాలనర్సయ్యగారు
భద్రయ్యగారి ఆత్మశాంతికై సదాశివుని ప్రార్థించుచున్నాము.
గురుమూర్తినగర్ ఇ.నెం. 15-32 అపోజిట్ ఐ డి.పి.యల్ కాలనీ
హైద్రాబాద్

(10) శ్రీ కత్తూరి బొర్రమల్లయ్యగారు
కుమారుడు- శ్రీ కృష్ణద్వారా, (హోల్‌సెల్ క్లాత్ మర్చంట్)
రామగోపాల్‌పేట, 2-4-100 మాలానీ బిల్డింగ్, సికింద్రాబాద్.

(11) బ్ర.శ్రీ. డి. హెచ్. రావుగారు: దాములూరు, విజయవాడ.

(12) శివశ్రీ॥ తాడికొండ పూర్ణానందరావుగారు C/62 కల్యాణఖని.

వీరందరికి ఆయురారోగ్య భాగ్యముల నొసగి సదా రక్షింపుమని
శ్రీ పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

శ్రీ మహాగణాధిపతయే నమః

# అపసిద్ధాంత నిరాకరణము

శివయోగి శ్రీ మహోపాధ్యాయ, షడ్దిగొండ నాగలింగశాస్త్రి వరేణ్యులు శ్రీమదప్పయ దీక్షితేంద్రుల వారి శైవగ్రంథాలను పఠించి "శైవుల సిద్ధాంతముగూడ కేవలాద్వైతము కావచ్చు" నని యోగవాసిష్ఠమునకు తెలుగు అర్థమును వ్రాసి శ్రీకంఠీయ శాంకర రామానుజీయ బ్రహ్మసూత్ర భాష్యములను పరిశీలించుచుండగా శ్రీ పండితస్వాములవారు రచించిన శ్రీకర భాష్యము కంటఁబడెను శ్రీకరభాష్యమునందు "జీవాత్మ-ఖద్యోతమువలె ప్రకాశమానుఁడు అప్రకాశమానుఁడు ననియు జీవాత్మ బద్ధదశయందు పరమాత్మతో భిన్నుఁడు కాగా ముక్తదశయందు పరమాత్మలో కలిసిపోవు ననియు వ్రాయఁబడినందున-ఇయ్యది పరస్పరవిరుద్ధార్థములతో నున్నందున శైవులకు ప్రమాణము కాదని (శ్రీ శాస్త్రిగారు) నిరాకరించిరి.

* * *

అప్పట్టున "శైవులకు దహనసాపిండ్యములు విహితములని" శ్రీ పాకయాజిగారును "ద్వైతాద్వైతమే మన సిద్ధాంత" మని శ్రీ చాగంటి

సీతయ్యశాస్త్రిగారును ప్రతిపాదించుచుండగా "దహనసాపిండ్యములు శైవు లకు విహితములు కావని కల్పసూత్ర శివాగమ ప్రమాణములనుదాహ రించుచు పాకయాజిగారి దహనసాపిండ్యవాదమును ఖండించి-శివాగమ ప్రోక్తమగు సమాధి సంస్కారమును శివమేధమును బాగుగా నిరూపించిన సిద్ధాంతమును శైవమహాజనులంగీకరించి-శిష్టాచారసమ్మతమైనదని ఆచర ణలో నున్నదానిని-సమర్థించుకొనసాగిరి. శ్రీ నీలకంఠ భగవత్పాదకృత బ్రహ్మసూత్రభాష్యమునకు దీక్షితేంద్రులు వ్రాసిన శివార్కమణిదీపికయను విపుల వ్యాఖ్యానమునవలోకించి అందుగల శివపారమ్యమును స్వీకరించి అటనట వ్రాయఁబడిన అద్వైతవాక్యములను విడనాడి "శివచింతామణి ప్రభ" యను వ్యాఖ్యానమును వ్రాసి వరంగలు వాస్తవ్యులు మహోన్నతలు నగు శ్రీశ్రీ ఆకారం నరసింగం శెట్టిగారి ధనసాహాయ్యమున ముద్రింపఁ జేసిరి. కారణోత్తరం మకుటం చంద్రజ్ఞానం ఇత్యాది శివాగమముల నను సరించి శ్రీ వేదవ్యాసకృత బ్రహ్మసూత్రములఁబట్టియు భ్రమరకీట న్యాయము సర్వశిష్టజన సమ్మతమగుటఁజేసియు విశిష్టశివాద్వైతమే శైవుల సిద్ధాంతమగునని నిర్ధారించి శైవులను కృతనిశ్చయులఁజేసిన శ్రీశాస్త్రిగారి వ్రాతలకు భిన్నముగా ఆధునిక పండితప్రకాండులు స్వాభీష్ట ఉపనిషత్తులకు ఊహాపోహలతో అర్థమును వ్రాయుచు-నదీసముద్రన్యాయములోని ఆంత ర్యము నుపేక్షించి శివజీవైక్యమును ద్వైతాద్వైత సిద్ధాంతమును నిరూ పించుచున్నారు. ఐక్యము నంగీకరించినచో జీవాత్మకు స్వరూప వినాశము తప్పదు గాన జీవాత్మకుగల నిత్యత్వము భంగపడును. అనేక జన్మార్జిత సుకృతఫలముగా గావింపఁబడిన శివోపాసన-సఫలము కాకుండును. శివా నందానుభవము హుళక్కియై "సోఽశ్నుతే సర్వాన్ కామాంత్సహ

బ్రహ్మణా" ఇత్యాది శ్రుతులు సార్థకములు కాజాలవు. ముక్తునకు పితృ గంధర్వలోకాదుల యనుభవము అభావమగును. అర్చిరాదిగతి యవసరము లేకయే జీవాత్మ-హార్ద బ్రహ్మమునందే లీనమగునెడ-"పరంజ్యోతిని సమీపించిన తరువాత నిజరూపమును సాక్షాత్కరించుకొనువాడగును జీవాత్మ" యను శ్రుత్యర్థమున కవకాశముండదు ఇంకా ఎన్నెన్నో అపసిద్ధాంత ప్రతిపాదనలు గానంబడుచున్నవి, శైవమహాజనులు ఇట్టి అపూర్వ నిరూపణములను విశ్వసింపక శివసాయుజ్యము అనగా? శివపృథక్ స్థితితో శివానందాస్వాదలోలుడై పునరావృత్తిరహితుఁడు జీవుఁడగుట; కారణకార్య శివుల ఏకీభావమగు శివాద్వైతసిద్ధాంతము; భ్రమరకీట న్యాయానుసారియగునదియే లింగధారణము; ఇత్యాది పూర్వశిష్ట సముల్లిఖితములను మది విశ్వసించి శైవసంప్రదాయము నాచరించి తరింతురు గాక !

ఇట్లు
నిర్మల శంకరశాస్త్రి

— — —

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ శివమహాపురాణమున ఏడవ వాయవీయ సంహితలో ఉత్తర భాగమునందు ముప్పది ఒకటవ (31) అధ్యాయమున పరమపాశుపతుండగు ఉపమన్యుమహర్షిగారు- శ్రీకృష్ణ భగవానునకు ఉపదేశించిన

# శివ మహా స్తోత్రము

ఉపమన్యురువాచ- ఉపమన్యుమహర్షి చెప్పఁదొడఁగెను,

**శ్లో॥ స్తోత్రం వక్ష్యామి తే కృష్ణ- పంచావరణమార్గతః**
**యోగేశ్వర మిదం పుణ్యం- కర్మయేన**
**సమాప్యతే॥ 1**

కృష్ణా! ఐదు ఆవరణముల మార్గమున నిరూపింపఁబడు శివమహా స్తోత్రమును చెప్పుచున్నాను. ఇద్ది శివయోగములలో శ్రేష్ఠమైె పుణ్యకార్య ఫలితమునంతయు నొసఁగునట్టిది.

ప్రథమావరణము : పరశివ ప్రార్థన.

**శ్లో॥ జయ జయ జగదేకనాథ శంభో**
**ప్రకృతిమనోహర। నిత్యచిత్స్వభావ।**
**అతిగత కలుష! ప్రపంచవాచా**
**మపి మనసాం పదవీ మతీతతత్త్వమ్॥ 2**

జగమునకు ఒకే ప్రభువగు శంకరా! ప్రకృతి (పార్వతీదేవి) మనసునాకర్షించినవాడా! శాశ్వతజ్ఞానరూపమున నీ యునికిఁ దెలుపువాడా! ఎట్టి కల్మషము బొత్తుగా లేనివాడా! ప్రపంచ గతములైన వేదశాస్త్ర వాఙ్మయమునకు ప్రాకృతమనంబులకు నందరాని స్వరూపము గలవాడా! శంభో! పెంపొందుము! (లేక) నన్ను పెంపొందించుము!

శ్లో॥ స్వభావనిర్మలాభోగ- జయ సుందర చేష్టిత ।
స్వాత్మతుల్య మహాశక్తే-జయ శుద్ధగుణార్ణవ॥ 3

నీ దివ్య ఆకారము నీ ఆవిర్భావమునుండియే నిర్మలమైనది. నీ లీలా విలాసములు సుందరములు అనగా లోకకల్యాణప్రదములగునట్టివి. నీ మహాశక్తి - నీ యంతఃకరణము ననువర్తించుచు నీ యధీనురాలై యుండును. ప్రకృతి సంబంధములేని శుద్ధగుణములగు దయాదాక్షిణ్యాదులకు సముద్రమువంటివాడవగు ఓ దేవా! జయము నొందుము!

శ్లో॥ అనంతకాంతి సంపన్న- జయాసదృశవిగ్రహ।
అతర్క్యమహిమాధార- జయానాకుల
మంగళ॥ 4

అవధిలేనట్టి దివ్యకాంతి గలవాడా! ఇతర దేవతామూర్తులు నీ మూర్తితో సమానములు గామిఁజేసి అసమానవిగ్రహముగలవాడా! దేవమానవాదులు తమ మానసికబలమున నూహింపరాని మహిమయే ఆధారముగ గలవాడా! భంగము లేనట్టి శుభపరంపర గలవాడా! సర్వోత్తరుడవై వర్ధిల్లుము!

శ్లో॥ నిరంజన! నిరాధార! జయనిష్కారణోదయ।
నిరంతర! పరానంద! జయ నిరతిశయోత్సవ॥ 5

పుణ్యపాపలేపనము బొత్తుగా లేనివాడా! సమస్త బ్రహ్మాండమునకు ఆధారము నీవే యగుటచేసి నీకు ఎట్టి యాధారము లేకుండుటచే నిరాధారుడని చెప్పబడువాడా! కర్మకాలవశత్వాది కారణములు లేకయే భక్తులకు సాక్షాత్కరించువాడా! అంతర్బహిస్సులందు వ్యాపించువాడవగుటచే అంతరము (నడుమనుండునది) లేనివాడా! నిరతిశయానంద ప్రచురమగు చిదాకాశమునందుండువాడా! సర్వసుఖములను మించునట్టి బ్రహ్మానందము నొదవజేయువాడా! సర్వోత్కర్షేణ వృద్ధినొందుము!

శ్లో॥ జయాతిపరమైశ్వర్య- జయాతికరుణాస్పద।
జయ స్వతంత్రసర్వస్వ- జయాసదృశవైభవ॥ 6

శ్రేష్ఠమైన ఐశ్వర్యము అత్యంతముగ గలవాడా! పరిపూర్ణమగు కృపకు ఆశ్రయమగువాడా! చరాచర ప్రపంచము నంతటినేలు స్వతంత్ర భావము గలవాడా! ఇతరులకు నీ వైభవము లేనందున నసమానమగు మహిమగలిగియున్న మహేశ్వరా! నీకు జయమగుగాక!

శ్లో॥ జయావృత మహావిశ్వ- జయానావృతకేనచిత్।
జయోత్తరసమస్తస్య- జయాత్యంత నిరుత్తర॥ 7

విశాలమైన ప్రపంచము నావరించియున్నావు. నిన్నేదియు వ్యాపించి యుండలేదు. సమస్తమునకన్న శ్రేష్ఠుడవు, నీకన్న గొప్పవాడు లేడు. అట్టి శంకరా! జయము నొందుము!

జయాద్భుత జయాక్షుద్ర- జయాక్షత జయ
జయామేయ జయామాయ- జయాభవ జయ

మహాదేవా! ఆశ్చర్యమగువాడవు, నీకు జయమగు! భావము నీయందు లేదుగాన ఎల్లకాలము పెంపొందుచుండు లేనివాడా! జయించుము! వినాశరహితుడవై ఇంతింతయని చె స్వమహిమగలవాడవు; మాయలోని అవిద్యాంశములేనివాడా గాక! సంసారబంధములేనివాడా! అణవకార్మికమాయిక రహితుడా! వృద్ధి నొందుము!

మహాభుజ మహాసార- మహాగుణ మ
మహాబల మహామాయ- మహారస మ

మహాదేవా! గొప్పభుజములు గలవాడవు; గొప్పన్యాయ శౌర్యాది మహాగుణములు, గొప్పచరితము, గొప్పపరివారము గొప్పఅనురాగము, గొప్పశరీరము (లేక) రథము గల నొందుము!

నమః పరమదేవాయ- నమః పరమే
నమః శివాయ శాంతాయ- నమఃశివత

ఆదిదేవునకు నమస్కారము. జగమునకు ప్రధా పరమాత్మకు వందనము. ఓర్పుతో భక్తులకు మోక్షము నొ

ప్రణామము. ఐహికఆముష్మిక (ఇహపరలోక) సుఖములనిచ్చువారిలో మిన్నయగు మహాదేవునకు అభివాదము.

త్వదధీన మిదంకృత్స్నం-జగద్ధి ససురాసురం॥
అతస్త్వద్విహితా మాజ్ఞాం-క్షమ తే కోఽ
తివర్తితుమ్॥ 11

దేవదేవా! దేవతలు రాక్షసులు మొదలగు జీవాత్మలతో నిండి యుండు ఈ జగమంతయు నీయధీనమై యున్నది. ఇందువలన నీవు విధించిన ఉత్తరువును మీఱుటకు నెవఁడు సమర్థుఁడగును?

అయం పున ర్జనో నిత్యం- భవదేకసమాశ్రయః
భవానతోఽ నుగృహ్యాస్మై- ప్రార్థితం సంప్రయ
చ్ఛతు॥ 12

ఈమానవుఁడు (నేను)మాత్రము- ఎల్లకాలము నిన్నే ముఖ్యముగా ఆశ్రయించినవాడు(అనగా? శరణాగతుడైనవాడు) గాన నీవు వీని (నా) పై దయగలవాడవై విడు కోరినదానిని గొప్పగా నొసఁగుము!

దేవీ ప్రార్థన.

జయాంబికే జగన్మాత- ర్జయ సర్వజగన్మయి।
జయానవధికైశ్వర్యే- జయానుపమవిగ్రహే ॥
13

అంబికా! జగజ్జననీ! జయమగుగాక! చరాచరప్రపంచమంతయు నీ రూపవేను; అట్టి నీవు జగద్రూపమున పెంపొందుము! మేర లేని సంపద గలదానవు; సాటిలేని ఆకారము గలదానవు: అభివృద్ధి నొందుము!

జయ వాఙ్మనసాతీతే. జయావిద్యాంధ్వాంత భంజికే।
జయ జన్మజరాహీనే. జయకాలోత్తరోత్తరే॥ 14

ప్రాకృతములగు వాక్కును మనస్సు నతిక్రమించిన దానవు: (అనగా? ప్రకృతివశములగు వాక్కుతో మనస్సుతోడను కనుగొన నలవి గాని దానవని భావము.) పరమేశ్వరు నారాధింపకుండుట అను అజ్ఞాన మనెడు చీకటిఁబారదోలుదానవు, జననము, మరియు పుట్టుకకు చెందిన ముదుసలితనము మున్నగు దశలు లేనిదానవు; కాలమనగా? సమయము, యముడు, మృత్యువనగు- కాలమునుమించునట్టి కాలకాలుడు శ్రేష్ఠుడుగ గలదానవు? యముని మృత్యువును శిక్షించు మృత్యుంజయునారాధించు వారిలో గొప్పదానవు; అమ్మా! అభివృద్ధినొందుము!

జయానేక విధానస్థే-జయ విశ్వేశ్వరప్రియే।
జయవిశ్వసురారాధ్యే-జయవిశ్వవిజృంభిణి॥ 15

అనేక పూజావిధానములలో ఇమిడియుండుదానవు: విశ్వనాధునకు ప్రియురాలవు, దేవతలందరిచే ఆరాధింపబడు దానవు; సూక్ష్మజగమును స్థూలముగా పెంచుదానవు: జయ!

జయమంగళ దివ్యాంగి-జయమంగళ దీపికే ।
జయమంగళ చారిత్రే-జయమంగళదాయిని॥ 16

మంగళమయమగు ప్రాకృతముకానట్టి దివ్యశరీరము గలదానా? ...ర్థ కార్యములను ఫలింపజేయుదానా! భక్తులకు క్షేమమునొసగూరు

చరితము గలదానా? సర్వాత్మనా నిన్నాశ్రయించువారికి శుభపరంపర నొసఁగుదానా? విజయము నొదవఁజేయుము!

నమః సర్వగుణసంచయమూర్తయే।
తత్త్వః ఖలు సముత్పన్నం-
జగత్త్వయ్యేవ లీయతే ॥ 17

సర్వజ్ఞత మున్నగు ఉత్కృష్టగుణముల సమూహముఁదగు మూర్తి గల జగదంబకు ప్రణామము. అమ్మా! జగము నీవలన నావిర్భవించి (జన్మించి) నది గదా! అటులే నీ ప్రపంచము నీయందే లీన (సూక్ష్మ) మగును.

త్వద్వినా తఃఫలందాతు-మీశ్వరోఽపి న శక్నుయాత్।
జన్మప్రభృతి దేవేశి-జనోఽయం త్వదుపాశ్రితః॥ 18

ఇందువలన తేలిన దేమనఁగా? ఆదిశక్తి! నిన్ను నిరాకరించినచో పరమేశ్వరుఁడు గూడ పుణ్యఫలము నొసగుటకు సమర్థుఁడు కాకుండును, ఈ మానవుడు (నేను) పుట్టినప్పటినుండి నిన్నాశ్రయించినవాడు

అతోఽస్య తవ భక్తస్య-నిర్వర్తయ మనోరథమ్।

కావున ఈ నీ భక్తుని కోరికను నెరవేర్చుము!

## సదాశివ ప్రార్థన.

పంచవక్త్రో దశభుజః శుద్ధస్ఫటికసన్నిభః॥ 19
వర్ణబ్రహ్మకళాదేహో, దేవః సకలనిష్కళః।

శివమూర్తి సమారూఢః-
శాంత్యతీతః సదాశివః॥ 20
భక్త్యా మయార్చితో మహ్యం-
ప్రార్థితం శం ప్రయచ్ఛతు॥

ఐదు ముఖములు. పది చేతులు పరిశుద్ధమైన స్ఫటికపువన్నె గల వాడు; అకారాదివర్ణ (అక్షర) ములు సద్యోజాతాదిపంచబ్రహ్మసముదా; యము (లేక)వేదము కళలు శరీరముగ గలవాడు; కళల (ముప్పది యారు తత్త్వ విభాగముల) తో కూడియు నిష్కళుఁడై యుండువాడు శివతత్త్వములో చేరియుండువాడు: శాంత్యతీతపదవి నధిష్ఠించినవాడు నగు సదాశివుఁడు - భక్తిని నాచే పూజింపఁబడినవాఁడై నేను కోరిన శుభమును నా కొసఁగుఁగాత!

## మహాలక్ష్మి ప్రార్థన.

సదాశివాంకమారూఢా-శక్తిరిచ్ఛా శివాహ్వయా
జననీ సర్వలోకానాం-ప్రయచ్ఛతు మనోరథం।

సదాశివుని ఒడిలో కూర్చున్న ఇచ్ఛాశక్తియు, సమస్త ప్రాణులకు తల్లియు నగు శివ యను పేరుగల అమ్మ-నా యభీష్టమును నెరవేర్చు గాక!

కుమార వినాయక మూలరూప ప్రార్థన.

శివయో ర్దయితౌ పుత్రౌ-దేవౌ హేరంబషణ్ముఖౌ॥
శివానుభావౌ సర్వజ్ఞౌ-శివజ్ఞానామృతాశినౌ।

తృప్తౌ పరస్పరం స్నిగ్ధౌ -
శివాభ్యాం నిత్యసత్కృతౌ॥ 23
సత్కృతౌచ సదా దేవౌ
బ్రహ్మాద్యై స్త్రిదశై రపి ।

సర్వలోకపరిత్రాణం-కర్తు మభ్యుదితౌ సదా॥24
స్వేచ్ఛావతారం కుర్వంతౌ -
స్వాంశభేదై రనేకశః ।

తా విమౌ శివయోః పార్శ్వే -
నిత్య మిత్థం మయాఽర్చితౌ॥ 25
తయో రాజ్ఞాం పురస్కృత్య -
ప్రార్థితం మే ప్రయచ్ఛతామ్॥

పార్వతీ పరమేశ్వరుల ప్రియపుత్రులు, శివశక్తులతో సమాన మగు వైభవము గలవారు. సర్వజ్ఞులు, శివజ్ఞాన మనెడు అమృతముం గ్రోలుచు తృప్తిపడువారు, ఒండొరులపై ప్రేమగలవారు , పార్వతీ పరమేశ్వరులచే ఎల్లకాలము అభినందింపఁబడువారు, బ్రహ్మాది దేవతలచే ఎలప్పుడు ప్రార్థింపఁబడువారు, లోకముల నన్నిటిని కాపాడుటకు సర్వదా సంసిద్ధులగువారు, మరియు తమ నానావిధములగు అంశలతో స్వేచ్ఛగా నవతరించువారు నగు వినాయకుఁడు కుమారస్వామియు పార్వతీ శంకరుల ప్రక్కన నిత్యము నాచే పూజింపఁబడువారై శక్తిశివుల యానతి (ఆజ్ఞ) నవలబించి నా కోర్కె నొసఁగుదురు గాక!

## పంచబ్రహ్మ ప్రార్థన

శుద్ధస్ఫటిక సంకాశ మీశానాఖ్యం సదాశివం॥
మూర్ధాభిమానినీ మూర్తిః శివస్య పరమాత్మనః।

శివార్చనరతం శాంతం
శాంత్యాతీతం ఖ మాస్థితమ్॥ 27
పంచాక్షరాంతిమం బీజం కలాభిః పంచభిర్యుతం।

ప్రథమావరణే పూర్వాం శక్త్యాసహ సమర్చితమ్॥
పవిత్రం పరమం బ్రహ్మ
ప్రార్థితం మే ప్రయచ్ఛతు।

శుద్ధమైన స్ఫటికమువలె ప్రకాశించునది, పరమాత్మయగు శివుని శిరస్సుపై అభిమానము గలదియు, శివార్చనలో ఆసక్తి కల దియు, శాంతమైనదియు, శాంత్యతీతకళయందు ప్రతిష్ఠింపబడినదియు, ఆకాశ మండలమునందు నివసించునదియు, శివపంచాక్షరీమహామంత్ర ములో ఐదవదైన "య" అను బీజాక్షర మగునదియు, ఐదు కళలతో కూడియుండునదియు, అన్నిటికంటె ముందు మొదటి ఆవరణమునందు శక్తితోకూడ పూజింపబడినదియు, పవిత్రంబు, పరబ్రహ్మంబునగు సదాశివునిజెందినట్టి ఈశానమను పేరుగల మూర్తి నా యభీష్టమును నెరవేర్చుగాక !

బాలసూర్యప్రతీకాశం
పురుషాఖ్యం పురాతనమ్॥ 29
పూర్వవక్త్రాభిమానం చ
శివస్య పరమేష్ఠినః।

శాంత్యాత్మకం మరుత్సంస్థం
శంభోః పాదార్చనే తరమ్ ॥ 30
ప్రథమం శివబీజేషు
కళాసు చ చతుష్కళం।

పూర్వభాగే మయా భక్త్యా
శక్త్యా సహా సమర్చితమ్॥ 31
పవిత్రం పరమం బ్రహ్మ
ప్రార్థితం మే ప్రయచ్ఛతు।

ప్రాతఃకాల సూర్యునివలె అరుణకాంతులతో విరాజిల్లునది, పరమేష్ఠియగు శివుని పూర్వ ముఖమునందు అభిమానము గలదియు, శాంతికళాస్వరూపము గలదియు, వాయుమండలమునందు ఉండునదియు, శివుని పాదకమలముల నర్చించునదియు, శివమంత్రబీజములలో మొదటిదైన "వ" అను బీజాక్షరమగునదియు, కళలలో నాలుగు కళలు గలదియు పూర్వదిశయందు శక్తితోగూడ నాచే పూజింపఁబడినదియు, పవిత్రము పరబ్రహ్మంబు నగు పురాతనమైన తత్పురుషమను పేరుగల మూర్తి - నా ప్రార్థితమును సఫలము జేయుగాక!

అంజనాదిప్రతీకాశ-మఘోరం ఘోరవిగ్రహం॥ 32
దేవస్య దక్షిణం వక్త్రం-దేవదేవపదార్చకం।

విద్యాపదం సమారూఢం వహ్నిమండలమధ్యగం॥33
ద్వితీయం శివబీజేషు-కళాస్వష్టకళాన్వితమ్।

శంభో ర్దక్షిణదిగ్భాగే-శక్త్యా సహ సమర్చితం॥ 34
పవిత్రం పరమం బ్రహ్మ-ప్రార్థితం మే ప్రయచ్ఛతు

కాటుక ముద్దగుదానిఁబోలిన వన్నె గలదియు. భయంకర స్వరూపంబు, మహాదేవుని పాదపద్మముల నర్చించునదియు, విద్యాపదము నధిష్ఠించినదియు, అగ్నిమండలమధ్యయందుండునదియు. శివమంత్ర బీజములలో రెండవదైన "మ" అను బీజాక్షరమగునదియు. కళలలో ఎనిమిది కళలతోకూడినదియు, దక్షిణదిగ్భాగమునందు శక్తితోకూడ పూజింపఁబడినదియు, పవిత్రము పరబ్రహ్మంబునగు శంకరుని దక్షిణ

అఘోరముఖము - నేను అడిగిన కోర్కె నొసఁగుగాక!

కుంకుమ క్షోదసంకాశం-వామాఖ్యం వరవేషధృక్ ॥35
వక్త్ర ముత్తర మీశస్య-ప్రతిష్ఠాయాం ప్రతిష్ఠితం,

వారిమండలమధ్యస్థం-మహాదేవార్చనే రతమ్॥ 36
తురీయం శివబీజేషు-త్రయోదశకళాన్వితం,

దేవస్యోత్తరదిగ్భాగే-శక్త్యా సహ సమర్చితమ్॥ 37
పవిత్రం పరమం బ్రహ్మ-ప్రార్థితం మే ప్రయచ్ఛతు।

పరమేశ్వరుని ఉత్తరముఖము - కుంకుమపొడిఁబోలిన సుందరస్వరూపముతో విరాజిల్లుచు. వామదేవుఁడను పేరుతో ప్రతిష్ఠయను కళయందు నెలకొని, ఉదకమండలము నడుమనున్నదై శివమంత్ర బీజములలో నాలుగవదైన "వా" అను బీజాక్షరముగా పదమూడు కళలతో కూడినదై - మహాదేవునకు ఉత్తరదిశయందు శక్తితోసహ ఆరాధింపఁబడుచుండును. పవిత్రము పరమంబునగు వామదేవబ్రహ్మము నా ప్రార్థితము నొసఁగుగాక!

శం. కుందేందు ధవళం-సద్యాఖ్యం సౌమ్యలక్షణం॥38
శివస్య పశ్చిమం వక్త్రం-శివపాదార్చనే రతం।

నివృత్తిపదనిష్ఠంచ-పృథివ్యాం సముపస్థితమ్॥ 39
తృతీయం శివబీజేషు-కళాభి శ్చాష్టభిర్యుతం।

దేవస్య పశ్చిమే భాగే-శక్త్యాసహ సమర్చితమ్॥ 40
పవిత్రం పరమం బ్రహ్మ-ప్రార్థితం మే ప్రయచ్ఛతు।

శంఖమువలె, మొల్లపుష్పమువలె, చంద్రునివలె తెల్లనిదియు, శాంతస్వరూపముగలదియు, నివృత్తికళయందు నివసించునదియు, భూమండలస్థితంబు, శివమంత్రబీజములలో మూడవదైన "శి" అను బీజాక్షరమగునదియు, ఎనిమిది కళలతో కూడియుండునదియు, శివుని పాదారవిందముల నర్చించుటలో ఆసక్తికలదియు, దేవుని పశ్చిమ దిశయందు శక్తితోగూడ పూజింపబడునదియు, పవిత్రము పరమంబునగు శివుని పశ్చిమ సద్యోజాత ముఖము - నా కోర్కె నిడుగాక!

శక్తి శివాంగ ప్రత్యంగ ప్రార్థన.

శివస్య చ శివాయాశ్చ-హృన్మూర్తీ శివభావితే॥ 41
తయో రాజ్ఞాం పురస్కృత్య-తే మే కామం ప్రయచ్ఛ
తామ్।

శక్తి హృదయములగు మూర్తులు రెండు - నాచే శివునిగా భావింపబడుచున్నవి. అట్టి ఆకారములు . శక్తి శివుల ఉత్తరువును ముందిడుకొని - నా మనోభీష్టమును నెరవేర్చుగాక!

శివస్య చ శివాయాశ్చ-శిఖామూర్తీ శివాశ్రితే॥ 42
సత్కృత్య శివయో రాజ్ఞాం-తే మే కామం ప్రయ
చ్ఛతామ్।

శివునియొక్కయు ఆదిశక్తియొక్కయు శిఖ (సిగ) లనెడు మూర్తులు - శివునాశ్రయించి యుండునవి. అట్టివి ఆదిదంపతుల యానతిని స్వీకరించి నా యభిలషితము నొసఁగుగాక!

శివస్య చ శివాయాశ్చ-వర్మణీ శివభావితే॥ 43
సత్కృత్య శివయో రాజ్ఞాం-తే మే కామం ప్రయచ్ఛ
తామ్।

పరమేశ్వరునియొక్కయు లలితా త్రిపుర సుందరీ మహాదేవి యొక్కయు భక్తులను రక్షింపఁబూనిన కవచములు రెండు - శివునిగా ధ్యానింపఁబడునట్టివి. అట్టి శివాశివకవచములు శక్తిశివుల శాసనమును సన్మానించి నా కోర్కె నీడేర్చుగాక!

శివస్య చ శివాయాశ్చ-నేత్రమూర్తీ శివాశ్రితే॥ 44
సత్కృత్య శివయో రాజ్ఞాం-తే మే కామం ప్రయచ్ఛ
తామ్।

శక్తిశివుల నేత్రమూర్తులు రెండు - శివు నాశ్రయించినవియై ఆ యాదిదంపతుల యానతి నవలంబించి నా యభీష్టము నొసఁగుగాక!

అస్త్రమూర్తీ చ శివయో-ర్నిత్య మర్చనతత్పరే॥ 45
సత్కృత్య శివయో రాజ్ఞాం-తే మే కామం ప్రయచ్ఛతామ్।

శక్తి శివుల ఆయుధజాతము అనెడు మూర్తులు రెండు - పార్వతీ పరమేశ్వరుల నెల్లకాలము పూజించుటలో నిండు మనస్సు గలిగియుండునవి. అట్టి అస్త్రమూర్తులు శివశక్తుల ఆజ్ఞను పురస్కరించుకొని నా యభిలషితము నొసఁగుగాక!

శివపరివారప్రార్థన.

వామో జ్యేష్ఠస్తథా రుద్రః-కాలో వికరణ స్తథా॥ 46
బలో వికరణః శైవః-బలప్రమథన స్తథా పరః।

సర్వభూతదమన-స్తాదృశా శ్చాష్టశక్తయః॥ 47
ప్రార్థితం మే ప్రయచ్ఛంతు-శివయో రేవ శాసనాత్।

వాముఁడు, జ్యేష్ఠుడు, రుద్రుఁడు, కాలుడు, వికరణుఁడు, బలకరణుఁడు, బలప్రమథనుఁడు, సర్వభూతదమనుఁడు, అను-పరమేశ్వరుని-ఎనిమిది మూర్తులు-మరియు వీరి శక్తులగు-వామ, జ్యేష్ఠ, రుద్రాణి, కాళి, వికరణి, బలవికరణి, బలప్రమథని, సర్వభూతదమని-అను దేవీ మూర్తులు ఎనిమిదియు శక్తి శివులయొక్క శాసనము ననుసరించి నా కోర్కెను త్వరలో ఫలింపఁజేయుగాక!

ద్వితీయావరణము.

శివగణ ప్రార్థన.

అథానంత శ్చ సూక్ష్మ శ్చ-శివశ్చాప్యేకనేత్రకః॥ 48
ఏకరుద్ర స్త్రిమూర్తి శ్చ-శ్రీకంఠశ్చ శిఖండికః।

తథాఽష్టౌ శక్తయ స్తేషాం-ద్వితీయావరణేఽర్చితాః॥
తే మే కామం ప్రయచ్ఛంతు-శివయో రేవ శాసనాత్।

అనంతుఁడు, సూక్ష్ముఁడు, శివుఁడు (లేక) శివోత్తముఁడు, ఏకనేత్రుఁడు, ఏకరుద్రుఁడు, త్రిమూర్తి, శ్రీకంఠుఁడు, శిఖండియు అను ఎనమండుగురు, మరియు నవ్వారి అష్టశక్తులగు అనంత, సూక్ష్మ, శివ (లేక) శివోత్తమ, ఏకనేత్ర, ఏకరుద్ర, త్రిమూర్తి, శ్రీకంఠి, శిఖండిని యను ఎనిమిది దేవీమూర్తులు-రెండవ ఆవరణమునందు పూజింపఁబడినవై, శక్తిశివుల అజ్ఞను పాటించి నా యభిలషితము నీడేర్చుగాక!

ద్వితీయావరణము ముగిసెను.

తృతీయావరణము.

భవాదిశివమూర్తి ప్రార్థన.

భవాద్యా మూర్తయశ్చాష్టౌ తాసామపిచ శక్తయః॥ 50
మహాదేవాదయ శ్చాన్యే-తథైకాదశ మూర్తయః।

శక్తిభిః సహితాః సర్వే-తృతీయావరణే స్థితాః॥ 51
సత్కృత్య శివయో రాజ్ఞాం-దిశంతు ఫల మీప్సితమ్।

"భవ శర్వ ఈశాన పశుపతి రుద్ర ఉగ్ర భీమ మహాదేవులు" అను ఎనిమిది మూర్తులు - అవ్వారి అష్టశక్తులును, 1. మహాదేవుఁడు. 2 శివుఁడు. 3. రుద్రుఁడు, 4. శంకరుఁడు, 5. నీలలోహితుఁడు, 6. ఈశానుడు, 7. విజయుఁడు, 8. భీముఁడు, 9. దేవదేవుఁడు, 10. భవోద్భవుఁడు, 11. కపర్దీశుఁడు నను పదునొకఁడు (ఏకాదశ) మూర్తులు - తమ తమ శక్తులతోకూడి తృతీయావరణమునందుండువారు.

అట్టి ముప్పదియెనమండుగురు - శక్తిశివుల యనుమతిని స్వీకరించి నా యాభీష్టఫలము నొసఁగుదురుగాక!

వృషభేశ్వరప్రార్థన.

వృషరాజో మహాతేజా-మహామేఘసమస్వనః॥ 52
మేరుమందర కైలాస-హిమాద్రి శిఖరోపమః।

సితాభ్రశిఖరాకార-కకుదా పరిశోభితః॥ 53
మహాభోగీంద్ర కల్పేన-వాలేన చ విరాజితః।

రక్తాస్య శృంగచరణో-రక్తప్రాయవిలోచనః॥ 54
పీవరోన్నత సర్వాంగః-సుచారుగమనోజ్జ్వలః।

ప్రశస్తలక్షణః శ్రీమాన్-ప్రజ్వలన్మణిభూషణః॥ 55
శివప్రియః శివాసక్తః-శివయో ర్ధ్వజవాహనః।

తథా తచ్చరణన్యాస-పావితాపరవిగ్రహః॥ 56
గోరాజపురుషః శ్రీమాన్-శ్రీమచ్ఛూలవరాయుధః।

తయోరాజ్ఞాం పురస్కృత్య-స మే కామం ప్రయచ్ఛతు॥

గొప్ప ప్రభావముగల ఎద్దుల జేడు (వృషభేశ్వరుఁడు) పెద్ద మబ్బు (మేఘము) తో సమానముగ ధ్వనించునది, మేరు మందర కైలాస హిమాలయ పర్వతముల శిఖరములవలె ఎత్తైన శరీరముఁదగు వన్నెతో నలరారునదియు; తెల్లని మేఘముల శిఖరముఁబోలిన మూపురముతో రాణించునదియు: మహాసర్పరాజు (ఆదిశేషుని) వంటి తోకతో విలసిల్లునదియు: ముఖము కొమ్ములు కాళ్ళు నెఱ్ఱనివగునదియు: తఱచుగా నెఱ్ఱఁబారు కన్నులుగలదియు: బలసిన ఎత్తైన సమస్త దేహము గలదియు: చక్కని నడతతో వెలుఁగునదియు: మంచి లక్షణముగలదియు, శివభక్తులందరిచే సత్కరింపఁబడునదియు: (శ్రీమాన్) తళతళ మెఱయు మణిభూషణములు గలదియు: పార్వతీపరమేశ్వరుల చరణ కమలముల స్పర్శచే పవిత్రమైన పృష్ఠభాగము కలదియు, శివప్రియ మైనదియు; శక్తిశివులయందు ఆసక్తికలదియు: శక్తిశివులకు ధ్వజము వాహనము గోవులఁజెందు రాజపురుషుఁడును: శ్రీమంతము వరాయుధము నైన త్రిశూలమును పట్టుకొనునదియునై యుండునది. అట్టి వృషభ రాజము-శక్తిశివుల యానతిఁగైకొని నా కోరికను సఫలముఁజేయుగాక!

నందీశ్వర ప్రార్థన.

సందీశ్వరో మహాతేజా-నగేంద్రతనయాత్మజః।
సనారాయణకై ర్దేవై-ర్నిత్య మభ్యర్చ్య వందితః॥58

శర్వస్యాంతఃపురద్వారి-సార్థం పరిజనైః స్థితః।
సర్వేశ్వరసమప్రఖ్యః-సర్వాసుర విమర్దనః॥ 59

సర్వేషాం శివధర్మాణా-మధ్యక్షత్వేఽభిషేచితః।
శివప్రియః శివాసక్తః-శ్రీమచ్ఛూలవరాయుధః॥ 60

శివాశ్రితేషు సంసక్త-స్త్వనురక్తశ్చ తైరపి।
సత్కృత్య శివయో రాజ్ఞాం-స మే కామం ప్రయచ్ఛతు॥

గొప్ప మహిమ గలవాడు: పర్వత రాజపుత్రికయగు పార్వతీదేవికి కుమారునివంటివాడు: హరిబ్రహ్మాది దేవతలచే ఎల్లకాలము బూజింపఁబడుచు నమస్కరింపఁబడువాడు: శంకరుని అంతఃపురముఁదగు ద్వారమున పరిజన(బలగ)ముతో కూడియుండువాడు: సర్వేశ్వరుఁడైన శంకరునితో సమానమైన సామర్థ్యము గలవాడు: రక్కసులందరిని దునుమాడువాడు: శివధర్మములగు భస్మరుద్రాక్షధారణ శివపంచాక్షరీ

జప శివలింగార్చనాదులను శ్రద్ధతో నాచరించు శివభక్తులందరియొక్క యధికార పదవిపై నభిషేకింపఁబడినవాడు: సంపదచే విరాజిల్లు వరాయుధ మగు త్రిశూలమును కేలఁబట్టుకొనువాడు: శివభక్తులయందనురాగము గలవాడు: శివభక్తులచే గౌరవింపఁబడువాడు: శివప్రియుఁడు: శివాసక్తుఁడు, నగు నందికేశ్వరుఁడు—నా యభీష్టమును నెరవేర్చుగాక!

శివగణాధీశ ప్రార్థన:

మహాకాలో మహాబాహు-ర్మహాదేవ ఇవాపరః।
మహాదేవాశ్రితానాం తు-నిత్యమేవాభిరక్షితా॥ 62

శివప్రియః శివాసక్తః శివయో రర్చకః సదా।
సత్కృత్య శివయో రాజ్ఞాం-స మే దిశతు కాంక్షితమ్।

రెండవ మహాదేవుఁడనదగినవాడు, బలిష్ఠములైన భుజములు గలవాడు నగు మహాకాలుడను శివగణాధీశుఁడు-శంకరునకు శరణాగతులైన భక్తుల నెల్లకాలము కాపాడుచుండును.

శివప్రియుఁడు శివాసక్తుడు శక్తిశివులను సదా పూజించువాడునగు మహాకాలుడు-పార్వతీపరమేశ్వరులయానతిని స్వీకరించి నా కోర్కెను నెరవేర్చుగాక!

ఆదిశేష ప్రార్థన.

సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః-శాస్తా విష్ణోః పరా తనుః।
మహామోహాత్మ తనయో-మధుమాంసాసవప్రియః॥64

తయో రాజ్ఞాం పురస్కృత్య-స మే కామం ప్రయచ్ఛతు।

సమస్త శాస్త్రముల ముఖ్యార్థమును గుర్తించువాడు; నాగజాతిని శాసించువాడు; నారాయణుని రెండవ స్వరూపంబు; మహామోహాత్మయగు కద్రూదేవియొక్క కుమారుఁడు; మద్యమాంసములయందు మత్తు-పానీయములయందు నభిరుచిగలవాఁడు నగు ఆదిశేషుఁడు-పార్వతీపరమేశ్వరుల శాసనమును ముందిడుకొని నా ఇచ్ఛ నీడేర్చుగాక!

సప్తమాతృకా ప్రార్థన.

బ్రహ్మాణీచైవ మాహేశీ-కౌమారీ వైష్ణవీ తథా॥ 65
వారాహీ చైవ మాహేంద్రీ-చాముండా చండవిక్రమా।

ఏతా వై మాతరః సప్త-సర్వలోకస్య మాతరః॥ 66
ప్రార్థితం మే ప్రయచ్ఛంతు-పరమేశ్వరశాసనాత్।

బ్రహ్మాణి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి. వారాహి, మాహేంద్రి, చండవిక్రమురాలగు చాముండాదేవి యను సప్తమాతృకలు-చరాచర

ప్రపంచమునకు తల్లులవంటివారు. పరమేశ్వరుని యాజ్ఞ ననుసరించి వీరు-నేనుకోరిన వస్తువు నిత్తురుగాక!

విఘ్నేశ్వర ప్రార్థన.

మత్తమాతంగవదనో-గంగోమాశంకరాత్మజః॥ 67
ఆకాశదేహో దిక్బాహుః_సోమసూర్యాగ్నిలోచనః।

ఐరావతాదిభి ర్దివ్యై-ర్దిగ్గజై ర్నిత్య మర్చితః 68
శివజ్ఞానమదోద్భిన్న-స్త్రిదశానా మవిఘ్నకృత్।

విఘ్నకృచ్చాసురాదీనాం-విఘ్నేశః శివభావితః॥69
సత్కృత్య శివయోరాజ్ఞాం-స మే దిశతు కాంక్షితం।

మదించిన ఏనుగుమొగము గలవాడు: గంగాపార్వతీ శంకరుల తనయుఁడు; ఆకాశము శరీరముగ, దిశలు భుజములుగ, సూర్యచంద్రాగ్నులు నేత్రములుగ గలవాడు; ఐరావతము మొదలగు దిగ్గజములచే నిత్యము పూజింపఁబడువాడు, శివజ్ఞానము అను మదమును తన శిరముపైనుండి ప్రవహింపఁజేయువాడు, అమరుల విఘ్నములఁబాఁడోలువాడు, అసురులు మున్నగు లోకకంటకులు తలపెట్టు కార్యములకు ఆటంకములను కల్పించువాడు శివుని సంభావించువాడు నగు విఘ్నేశ్వరుఁడు-శక్తిశివుల యానతిని నా కోర్కె నీడేర్చుగాక!

## కార్తికేయ ప్రార్థన.

షణ్ముఖః శివసంభూతః-శక్తివజ్రధరః ప్రభుః॥ 70
అగ్నేశ్చ తనయో దేవో-హ్యపర్ణాతనయః పునః।

గంగాయాశ్చ గణాంబాయాః-కృత్తికానాంత ఏవ చ 71
విశాఖేన చ శాఖేన-నైగమేయేన చావృతః।

ఇంద్రజి చ్చేంద్రసేనానీ-స్తారకాసురజి త్తథా॥ 72
శైలానాం మేరుముఖ్యానాం-వేధక శ్చ స్వతేజసా।

తప్త చామీకరప్రఖ్యః-శతపత్రదళేక్షణః॥ 73
కుమారః సుకుమారాణాం-రూపోదాహరణం మహత్

శివప్రియః శివాసక్తః-శివపాదార్చకః సదా॥ 74
సత్కృత్య శివయోరాజ్ఞాం-స మే దిశతు కాంక్షితమ్.

ఆఱుమొగములు గలవాడు, చంద్రశేఖరునివలన జన్మించినవాడు శక్తిని వజ్రమును కేలందాల్చువాడు, చరాచరప్రపంచాధిపతియు, అగ్నిపుత్రుఁడు, పార్వతీతనయుఁడు, గంగాదేవికి ఆరుగురు కృత్తికలకును ప్రియకుమారుఁడు, విశాఖుఁడు శాఖుఁడు నైగమేయుఁడు వనువారు అనుచరులుగ గలవాడు, దేవేంద్రునోడించినవాడు, సందర్భానుసారముగా

వేల్పులతేడునకు సేనాధిపతియై సహకరించువాడు, తారకాసురుని సంహరించినవాడు, మేరువు మున్నగు పర్వతములను తన శక్తితో ఛేదించినవాడు, కాచఁబడిన బంగరువన్నె శరీరముగలవాడు, వికసించిన కమలములవంటి కన్నులుగలవాడు, సుకుమారుల రూపమునకు గొప్ప ఉదాహరణమగువాడు, శివప్రియుఁడు, శివునియందు భక్తిగలవాడు, ఎల్లకాలము శివుని చరణకమలముల నర్చించువాడు నగు కుమారస్వామి-శక్తిసదాశివుల ఉత్తరువు ననుసరించి నేను కోరు వస్తువు నొసఁగుగాక!

జ్యేష్ఠాదేవి ప్రార్థన.

జ్యేష్ఠా వరిష్ఠా వరదా-శివయో ర్యజనే రతా॥ 75
తయో రాజ్ఞాం పురస్కృత్య-సా మే దిశతు కాంక్షితం।

దేవేరులలో మిన్న, వరప్రదాయిని. పార్వతీపరమేశ్వరుల నారాధించుటయందు ఆసక్తికలదియు నగు జ్యేష్ఠాదేవి -శక్తిశివుల యాదేశమును ముందిడుకొని నా యభీష్టము నీడేర్చుగాక!

రుద్రాణీ ప్రార్థన.

త్రైలోక్యవందితా సాక్షా-దుల్కాకారా గణాంబికా 76
జగత్సృష్టి వివృద్ధ్యర్థం-బ్రహ్మణాఽభ్యర్థితా శివాత్,

శివాయాః ప్రవిభక్తాయా-భ్రువోరంతరనిఃసృతా॥ 77
దాక్షాయణీ సతీ మేనా-తథా హైమవతీ హ్యుమా।

కౌశిక్యాశ్చైవ జననీ-భద్రకాళ్యాః స్తథైవ చ॥ 78
అపర్ణాయాశ్చ జననీ-పాటలాయా స్తథైవ చ।

శివార్చనరతా నిత్యం-రుద్రాణీ రుద్రవల్లభా॥ 79
సత్కృత్య శివయో రాజ్ఞాం-సా మే దిశతు కాంక్షితమ్।

దివిటీవంటి స్వరూపముగలదియు; ముల్లోకజనముచే మ్రొక్కఁబడునదియు; జగమును పుట్టించి పెంపొందించుటకై బ్రహ్మదేవునిచే ప్రార్థింపబడినదై శివునినుండి వేఱుపడినట్టి ఆదిశక్తియొక్క కనుబొమల నడిమినుండి జన్మించినదియు; దాక్షాయణీదేవి సతీదేవి మేనాదేవి హిమవంతుని కుమార్తెయగు ఉమాదేవి మున్నగు రూపములతో నొప్పారునదియు; కౌశికి భద్రకాళి అపర్ణ పాటల యనువారికి జననియునగు గణాంబికాదేవి-నిత్య శివార్చనఁజేయుచు రుద్రవల్లభ రుద్రాణి యనఁబఱఁగుచు శక్తిశివుల యానతిని స్వీకరించి నా మనోవాంఛను ఫలింపఁజేయుగాక!

## చండేశ్వరాది ప్రార్థన.

చండః సర్వగణేశానః-శంభోర్వదనసంభవః॥ 80
సత్కృత్య శివయో రాజ్ఞాం-స మే దిశతు కాంక్షితం।

శంకరుని నోటినుండి పుట్టినవాడు, శివగణముల నన్నిటిని శాసించువాడు నగు చండుఁడు, ఋషభమునీంద్రుఁడును, పార్వతీ పరమేశ్వరుల శాసనమును సత్కరించి నా ఈప్సితము నొసగుఁగాక!

పింగళో గణపః శ్రీమాన్-శివాసక్తః శివప్రియః 81
ఆజ్ఞయా శివయో రేవ-సమే కామం ప్రయచ్ఛతు।

శివవిభూతి శివునియందు భక్తియు గలవాడు శివప్రియుఁడు నగు పింగళుఁడను గణాధిపతి-పార్వతీపరమేశ్వరుల శాసనమున నాకు వలయు కోరిక నీడేర్చుగాక!

భృంగీశో నామ గణపః-శివారాధనతత్పరః॥ 82
ప్రయచ్ఛతు సమే కామం-పత్యురాజ్ఞాపురఃసరమ్।

శివు నారాధించుటలో నిండు మనస్సుగల భృంగీశుఁడను ఒకానొక గణపాలుఁడు-తన ప్రభువుయొక్క ఉత్తరువు ననుసరించి నేను కోరు వరము నొసఁగుగాక!

వీరభద్రేశ్వర ప్రార్థన.

వీరభద్రో మహాతేజా-హిమకుందేందు సన్నిభః॥ 83
భద్రకాళీ ప్రియో నిత్యం-మాతౄణాం చాభిరక్షితా।

యజ్ఞస్య చ శిరోహర్తా-దక్షస్య చ దురాత్మనః॥ 84
ఉపేంద్రేంద్రయమాదీనాం-దేవానా మంగతక్షకః।

శివస్యానుచరః శ్రీమాన్-శివశాసనపాలకః॥ 85
శివయోః శాసనాదేవ-స మే దిశతు కాంక్షితమ్।

మంచు, మొల్లపుష్పము, చందమామ అనువానిఁబోలిన మేనువన్నె గలవాడు, గొప్ప మహిమతో రాణించువాడు, భద్రకాళి యను అమ్మవారి భర్తయు, "బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి ఇంద్రాణి చాముండి" అను సప్తమాతల నెల్లకాలము రక్షించువాడు, దురాత్ముఁడగు దక్షప్రజాపతి యొక్కయు ఆతని యజ్ఞముయొక్కయు తలను నఱుకువాడు, ఉపేంద్రుఁడు (విష్ణువు) దేవేంద్రుఁడు యమధర్మరాజు మున్నగువారి శరీరములను మర్దించువాడు, శివుని యనుచరుఁడు, శివాజ్ఞను శిరసావహించువాడు, శ్రీమంతుఁడు నగు వీరభద్రస్వామి .........

గౌరీశంకరుల యానతి ననుసరించి నా మనోవాంఛను సఫలము జేయుగాక!

## సరస్వతీలక్ష్మ్యాది ప్రార్థన

సరస్వతీ మహేశస్య-వాక్ సరోజ సముద్భవా॥ 86
శివయోః పూజనే సక్తా-సా మే దిశతు కాంక్షితమ్।

మహేశ్వరుని ముఖకమలమునుండి యావిర్భవించినదియు శక్తి సదాశివుల నారాధించునదియు నగు సరస్వతీదేవి-నాకోర్కె నీడేర్చుగాక!

విష్ణోర్వక్షః స్థితాలక్ష్మీః-శివయోః పూజనే రతా॥ 87
శివయోః శాసనా దేవ- సా మే దిశతు కాంక్షితమ్।

నారాయణుని వక్షఃస్థలమునందు విరాజిల్లునది, పార్వతీ పరమేశ్వరుల నర్చించుటయందు ఆసక్తి గలదియు నగు లక్ష్మీదేవి-శక్తి

శివుల యుత్తరువుఁగైకొని నా యభిలషితము నొసగుగాక!

మహామోటీ మహాదేవ్యాః-పాదపూజా పరాయణా॥ 88
తస్యాఏవ నియోగేన-సామే దిశతు కాంక్షితమ్।

దేవీమూర్తులలో గొప్పదైన పార్వతీదేవి యొక్క పాదపద్మములను పూజించుటలో ఆసక్తి కలిగియుండు "మహామోటి" అను దేవత- ఆ యమ్మ యానతిచేతనే నా కోరిక నీడేర్చుగాక!

కౌశికీ సింహమారూఢా-పార్వత్యాః పరమానుతా॥ 89
విష్ణోర్నిద్రా మహామాయా-మహామహిషమర్దినీ।

నిశుంభశుంభ సంహర్త్రీ-మధుమాంసాసవప్రియా॥ 90
సత్కృత్య శాసనం మాతుః-సామే దిశతు కాంక్షితం।

పార్వతీదేవి యొక్క కుమార్తెలలో శ్రేష్ఠురాలగు కౌశికీదేవి; విష్ణుమూర్తి యొక్క యోగనిద్రయగు మహామాయాదేవి; మహామహిషాసురుని సంహరించినట్టి మహాలక్ష్మీదేవి; తేనె, పండ్లలోనిగుజ్జు, ఫలరసము అను వానినిఁ గ్రోలునది, నిశుంభశుంభులఁ దునుమాడునదియునగు మహా సరస్వతీదేవియునగు దుర్గాదేవి జగజ్జననియైన ఆదిశక్తిఁదగు ఆజ్ఞను పురస్కరించుకొని నా మనోవాంఛితమును ఫలింపఁజేయుగాక।

రుద్రగణ ప్రార్థన

రుద్రా రుద్రసమప్రఖ్యాః-ప్రమథాః ప్రథితౌజసః॥ 91

భూతాఖ్యాశ్చ మహావీర్యా-మహాదేవ సమప్రభాః।

నిత్యముక్తా నిరుపమా-నిర్ద్వంద్వా నిరుపప్లవాః॥ 92
సశక్తయః సానుచరాః-సర్వలోకసమస్కృతాః।

సర్వేషామేవ లోకానాం-సృష్టిసంహరణక్షమాః॥ 93
పరస్పరానురక్తాశ్చ-పరస్పరమనువ్రతాః।

పరస్పరే మతిస్నిగ్ధాః-పరస్పర సమస్కృతాః॥ 94
శివప్రియతమా నిత్యం-శివలక్షణలక్షితాః।

సౌమ్యా ఘోరాస్తథామిశ్రా-శ్చాంతరాళ
ద్వయాత్మకాః॥ 95
విరూపాశ్చ సురూపాశ్చ-నానారూపధరాస్తథా।

సత్కృత్య శివయోరాజ్ఞాం-తేమేకామందిశంతువై॥ 96

రుద్రునితో సమానమైన ప్రసిద్ధి, సర్వజనవిదితమగు బలము, గొప్ప పరాక్రమము, మహాదేవప్రతిభతో సరిదూగు ప్రభావంబు గలిగి నట్టి రుద్రగణములు-ప్రమథులనియు దేవయోని విశేషములగు భూతము లనియు పేర్కొనఁబడును. అట్టివారు-నిత్యముక్తులు, (పునరావృత్తి రహితముగ శాశ్వతశివానందము ననుభవించువారు) సమానులు లేని వారు, ఒకరియందొకరు వైరము లేనివారు, ప్రకృతి సంబంధములగు బాధలు లేనివారు, తమతమ శక్తులతో అనుచరులతోడను కూడియుండు

వారు, లోకములన్నిటియందు నమస్కరింపఁబడువారు, సురాసుర మానవాది ప్రపంచమును పుట్టించుటయందు గిట్టించుటయందును సమర్థులగువారు, ఒకరియందు మరియొకరు అనురాగముగలిగి ఒకరినొకరు అనుసరించుచు అన్యోన్య స్నేహముతో విరాజిల్లుచు ఒకరినొకరు నమస్కరించువారు, పరశివునకు అత్యంత ప్రియులు, శివుని లక్షణములగు భస్మరుద్రాక్షధారణాదులతో గుర్తింపఁబడువారు, శాంతస్వభావులు, ఉగ్రచిత్తులు, శాంతము ఉగ్రంబు కూడియుండువారు, శాంతస్వభావులయొక్కయు ఉగ్రచిత్తులయొక్కయు మధ్యవర్తులగువారు, వికృతరూపముగలవారు, చక్కని రూపము గలవారు, పలురకములగు వేషములదాల్చువారుగ నుందురు.

ఇట్టి రుద్రగణములు-ఆదిపరాశక్తి యొక్కయు, శక్తివిశిష్టుఁడై పరమాత్మగా ముముక్షువులచే నుపాసింపఁబడు పరశివుని యొక్కయు ఉత్తరువుఁ గైకొని నా యభీష్టమును తత్కాలముననే సిద్ధింపఁజేయుదురు గాక!

దేవీపరిచారికా ప్రార్థన

దేవ్యాః ప్రియసఖీవర్గో-దేవీలక్షణ లక్షితః।
సహితో రుద్రకన్యాభిః-శక్తిభిశ్చాప్యనేకశః॥ 97

తృతీయావరణే శంభో-ర్భక్త్యా నిత్యం సమర్చితః।
సత్కృత్య శివయోరాజ్ఞాం-సమేదిశతు మంగళమ్॥ 98

అమ్మవారికి ప్రియమైన సఖురాండ్ర (చెలికత్తెల) సమూహము-

దేవియొక్క కస్తూరి తిలకధారణాది చిహ్నములతో గుర్తింపఁబడునది. అట్టి సఖీవర్గము-ద్రుద్రకన్యలతోడను అనేక శక్తులతోడను కూడినదై శంకరుని తృతీయావరణమునందు నిత్యము భక్తిచే పూజింపఁబడుచు-పార్వతీ పరమేశ్వరుల యానతి నవలంబించి నాకు శుభమును చేకూర్చుగాక!

## చతుర్థావరణము

### సూర్య ప్రార్థన

దివాకరో మహేశస్య-మూర్తిర్దీప్తసుమండలః।
నిర్గుణో గుణసంకీర్ణ-స్తథైవ గుణకేవలః॥ 99
అవికారాత్మకశ్చాద్య-ఏకః సామాన్యవిక్రియః।
అసాధారణకర్మా చ-సృష్టిస్థితిలయక్రమాత్॥ 100
ఏవం త్రిధా చతుర్ధా చ-విభక్తః పంచధా పునః।
చతుర్థావరణే శంభోః-పూజితశ్చ సహానుగైః॥ 101

శివప్రియః శివాసక్తః-శివపాదార్చనే రతః।
సత్కృత్య శివయో రాజ్ఞాం-స మే దిశతు
మంగళమ్॥ 102

సూర్యుడు-మహేశ్వరుని ఒకానొక మూర్తియగును. సూర్యుని వలయాకారము (మండలము) సుందరమై వెలుగుతో నిండియుండును. సూర్యభగవానుఁడు-ప్రాకృత గుణములు (ఆకలి దప్పి మున్నగునవి)

లేనివాడై-మిశ్రములగు సత్త్వరజస్తమో గుణముల నవలంబించినను శుద్ధసత్త్వగుణమాత్ర పరిపూర్ణుఁడై యుండును. ఎట్టి వికారములేని స్వరూపము గలవాడై సమస్తజగత్కారణ మగుటచే ఏకమాత్రుఁడై యుండును. జగమున నిత్యము సాధారణముగ సంభవించు సృష్టి-సూర్యునిదేను; సృష్టి స్థితి లయములు సూర్యుని అసాధారణకర్మలు; ఇవ్విధము సూర్యుడు-మూడు నాలుగు ఐదు రూపములలో విభాగముఁ జెంది శివుని చతుర్థ (నాలుగవ) ఆవరణమునందు-తన అనుచరులతో సహ నాచే పూజింపఁబడుచు శివప్రియుఁడు శివభక్తుఁడునై శివుని చరణ కమలముల నర్చించువాడు. అట్టి ఆదిత్యుఁడు-గౌరీశంకరుల ఉత్తరువుఁగైకొని నాకు శుభమును కలుగఁజేయుగాక!

### సూర్యపరివార ప్రార్థన.

దివాకరషడంగాని-దీప్తాద్యాశ్చాష్టశక్తయః । [103
ఆదిత్యో భాస్కరో భానూ-రవిశ్చేత్యనుపూర్వశః ॥

అర్కో-బ్రహ్మా తథా రుద్రో-విష్ణుశ్చాదిత్య
మూర్తయః ।[104
విస్తరా సుతరా బోధి-న్యాప్యాయిన్యపరాః పునః ॥

ఉషా ప్రభా తథా ప్రాజ్ఞా-సంధ్యా చేత్యపి
శక్తయః । [105
సోమాది కేతు పర్యంతా-గ్రహాశ్చ శివభావితాః ॥

శివయో రాజ్ఞయా నున్నా-మంగళం ప్రదిశంతు
మే । [106
అథవా ద్వాదశాదిత్యా-స్తథా ద్వాదశ శక్తయః ॥
ఋషయో దేవగంధర్వాః-పన్నగాప్సరసాం
గణాః ।[107
గ్రామణ్యశ్చ తథా యక్షా-రాక్షసాశ్చ సురాస్తథా ॥
సప్తసప్తగణాశ్చైతే-సప్తచ్ఛందోమయాహయాః।
వాలఖిల్యాదయశ్చైవ-సర్వే శివపదార్చకాః ॥ 108
సత్కృత్య శివయో రాజ్ఞాం-మంగళం ప్రదిశంతు మే ।

సూర్యుని సంబంధముగల ఆరు అంగములు, దీప్త, సూక్ష్మ, జయ, భద్ర, విభూతి, విమల, అమోఘ, విద్యుతయను- అష్టశక్తులు, ఆదిత్యుఁడు, భాస్కరుఁడు, భానువు, రవి, అర్కుఁడు, బ్రహ్మ, రుద్రుఁడు, విష్ణువు నను ఆదిత్యమూర్తులు ఎనిమిది, విస్తర, సుతర, బోధిని, ఆప్యాయిని, ఉష, ప్రభ, ప్రాజ్ఞ, సంధ్య యను ఎనిమిది సూర్యశక్తులు; చంద్రుఁడు మొదలుకొని కేతువు వరకుగల శివుని భావించువారునగు గ్రహములు; శక్తి శివుల యానతికి బద్ధులై నాకు మేలు నొనగూర్తురు గాక !

ఇంతియేగాక పండ్రెండుగ్రు ఆదిత్యులు, అవ్వారి ద్వాదశశక్తులు, ఋషులు, దేవతలు, గంధర్వులు, నాగులు, అప్సరసలు, ఖేచరులు,

(గ్రామణులు) యక్షులు, రాక్షసులు, సురలు, సప్త సంఖ్యగల సప్త గణములు, ఏడు ఛందస్సులుగా నుండు అశ్వములు, వాలఖిల్యులు మున్నగు మునులు, వీరందరును శివపదార్చకులుగాన శక్తి శివుల శాసనము ననుసరించి నాకు శుభమును చేకూర్చుదురుగాక !

బ్రహ్మోఽథ దేవదేవస్య-మూర్తి ర్భూమండలా
ధిపః ॥109

చతుఃషష్టి గుణైశ్వర్యో-బుద్ధితత్త్వే ప్రతిష్ఠితః ।
నిర్గుణో గుణసంకీర్ణ-స్తథైవ గుణకేవలః ॥ 110

అవికారాత్మకో దేవ-స్తతః సాధారణః పురః ।
అసాధారణకర్మాచ-సృష్టిస్థితిలయక్రమాత్ ॥ 111

ఏవం త్రిధా చతుర్ధాచ-విభక్తః పంచధా పునః ।
చతుర్థావరణే శంభోః-పూజితశ్చ సహానుగైః ॥ 112

శివప్రియః శివాసక్తః-శివపాదార్చనే రతః ।
సత్కృత్య శివయో రాజ్ఞాం-నమే దిశతు మంగ
ళమ్ ॥ 113

దేవదేవుఁడైన శంకరుని మూర్తియగు బ్రహ్మదేవుఁడు-భూమండలమునకు అధిపతి యగును. ఆరువదినాలుగు గుణముల ఐశ్వర్యము గలిగి-

బుద్ధితత్త్వమునందు నెలకొనియుండును. ప్రాకృత గుణములు లేని వాడై సత్త్వరజస్తమో గుణసంపన్నుఁడు శుద్ధసత్త్వ గుణమాత్ర పరిపూర్ణుఁడు ఎట్టి వికారము లేని వాడునై యుండును. బ్రహ్మదేవుని ముందు సురదానవ మానవాది ప్రజలు సామాన్యులు కాగా సృష్టి స్థితి లయ క్రమమున ఆతని కర్తవ్యము అసాధారణ మగును, ఇవ్విధము మూడు నాలుగు ఐదు విధములైన స్వరూపములయందు విభజింపఁబడి శివుని నాలుగవ ఆవరణమునందు అనుచరులతోకూడ నాచే పూజింపఁబడువాడు. శివప్రియుడు శివాసక్తుఁడు శివపాదార్చనాసక్తుఁడు నగు బ్రహ్మదేవుఁడు-శక్తిశివుల యాజ్ఞ ననుసరించి నాకు శుభమును చేకూర్చుగాక.

బ్రహ్మపరివార ప్రార్థన.

హిరణ్యగర్భో లోకేశో-విరాట్ కాలశ్చ పూరుషః ।
సనత్కుమారః సనకః-సనందశ్చ సనాతనః ॥ 114

ప్రజానాం పతయ శ్చైవ-దక్షాద్యా బ్రహ్మసూనవః ।
ఏకాదశ సపత్నికా-ధర్మః సంకల్ప ఏవచ ॥ 115

శివార్చనరతా శ్చైతే-శివభక్తి పరాయణాః । [116
శివాజ్ఞావశగాః సర్వే-దిశంతు మమ మంగళమ్ ॥

హిరణ్యగర్భుఁడు, లోకేశుడు, విరాట్, కాలపురుషుడు, సనత్కుమారుఁడు, సనకుడు, సనందనుఁడు సనాతనుఁడు, బ్రహ్మపుత్రులైన దక్షుఁడు,

2 రుచి, 3 భృగువు, 4 మరీచి, 5 అంగిరుఁడు, 6 పులస్త్యుడు, 7 పులహుఁడు, 8 క్రతువు, 9 అత్రి, 10 కశ్యపుఁడు, 11 వసిష్ఠుఁడునను-

పదునొకండుగురు ప్రజాపతులు, 1 ప్రసూతి, 2 ఆకూతి, 3 ఖ్యాతి, 4 సంభూతి, 5 ధృతి, 6 స్మృతి, 7 క్షమ, 8 సన్నతి, 9 అనసూయ, 10 అదితి, 11 అరుంధతియను తమ భార్యలతో కూడినవారై బ్రహ్మలోకమున నుందురు. ధర్మము సంకల్పంబు ననువానితో ముప్పదిరెండుగురు-శివునర్చించుటయందాసక్తిగలిగి "శివుడే పరమాత్మ" యను పరాభక్తితో శివుని యానతికి బద్ధాంజులరై నాకు శుభము నొదవఁజేయుదురుగాక !

చత్వారశ్చ తథా వేదాః-సేతిహాసపురాణకాః ।[117
ధర్మశాస్త్రాణి విద్యాభి-ర్వైదికీభిః సమన్వితాః ॥

పరస్పరావిరుద్ధార్థాః-శివస్య ప్రతిపాదకాః । [118
సత్కృత్య శివయో రాజ్ఞాం-మంగళం ప్రదిశంతు మే

నాలుగు వేదములు, ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు, మరియు వైదికవిద్యలు, నివియన్నియు ఒకదానికి మరి యొకటి విరుద్ధముగాని అర్థము గలవై-శివుఁడే పరమాత్మయనియు శివుఁడే ఉపాస్యుఁడై మోక్షప్రదాత యగుననియు-శివుని ప్రతిపాదించునవి యగును.

ఇయ్యవి-శక్తి శివులయొక్క ఉత్తరువు ననుసరించి నాకు శుభము నొసగుదురుగాక !

కైలాస శంకరుని ప్రార్థన.

అథ రుద్రో మహాదేవః-శంభోర్మూర్తిర్గరీయసీ।[119
వాహ్న్యమమండలాధీశః-పౌరుషైశ్వర్యవాన్ ప్రభుః॥

శివాభిమానసంపన్నో-నిర్గుణస్త్రిగుణాత్మకః । [120
కేవలం సాత్త్వికశ్చాపి-రాజసశ్చైవ తామసః ॥

అవికారరతః పూర్వం-తతస్తు సమవిక్రియః । [121
అసాధారణకర్మా చ-సృష్ట్యాదికరణాత్ పృథక్ ॥

బ్రహ్మణోఽపి శిరశ్ఛేత్తా-జనక స్తస్య తత్సుతః ।
జనకస్తనయశ్చాపి-విష్ణోరపి నియామకః ॥ 122

బోధకశ్చ తయోర్నిత్య-మనుగ్రహకరః ప్రభుః॥[123
అండస్యాంత ర్బహిర్వర్తీ-రుద్రోలోకద్వయాధిపః ॥

శివప్రియః శివాసక్తః-శివపాదార్చనే రతః । [124
శివస్యాజ్ఞాం పురస్కృత్య-సమే దిశతు మంగళమ్ ॥

పరమశివుని రూపములలో ముఖ్యమూర్తియగు మహాదేవుఁడన బఱఁగు రుద్రుఁడు- అగ్నిమండలాధిపతియై సమస్త పురుషార్థములతో అణిమాద్యష్టైశ్వర్యములతోడ నుండువాడు. రుద్రునిపై పరశివుని యభిమానము (అనఁగా? పరశివుఁడు నిండుగా నుండుట) మేలుకొని యుండును. క్షుత్పిపాసాది క్షుద్రగుణములు లేనివాడై సత్త్వరజస్తమో గుణములకు ఆశ్రయము నొసఁగు రుద్రుఁడు-ఒకప్పుడు సత్త్వగుణ పరిపూర్ణుడై, మరియొకతూటి-రజోగుణ విశిష్టుఁడై, ఇంక నొకవేళ-తమోగుణము నవలంబించువాడు. జనను తన యావిర్భావమునుండి

నిర్వికారుఁడై-సమయసందర్భములననుసరించి వికారముగలవానివలె నటించును. రుద్రుఁడు- జగమును పుట్టించి కాపాడుచు గిట్టించును గాన నీతని చేష్టలు- సర్వసాధారణములు కానివని తెలియవలెను.

సృష్టికర్తయగు బ్రహ్మదేవుని గర్వము నణచుటకు ఆతని ఐదవ శిరమును ఖండించు శంకరుఁడు-మహాసృష్టిప్రారంభమున విధాతను పుట్టించెను. తరువాత సృష్టి కొనసాగుటకు బ్రహ్మ లలాటమునుండి జన్మించెను. అనఁగా? బ్రహ్మదేవునకు జనకుఁడు తనయుఁడునని గుర్తింపవలెను. ఇటులే నారాయణుని పుట్టించుటయేగాక అతని కృష్ణావతారమునందు సాంబుఁడను కుమారుఁడై జన్మించెను. విష్ణు దశావతారములలో నిగ్రహావతారములగు వామన నరసింహ పరుశురామాదులకు మూలరూపమగు నారాయణుని శిక్షించువాడు, బ్రహ్మవిష్ణువులు మితిమీరినపుడు అవ్వారిని మందలించుచు ఎల్లకాలము వారి ననుగ్రహించువాడు, బ్రహ్మాండములోనను బయటను వ్యాపించువాడు, పదునాలుగు ఇహలోకములకు పరమపదమునకును ప్రభువగువాడు, శివలోకవిరాజమానుండగు పరశివుని ప్రేమకు పాత్రుఁడు, పరశివునియందు భక్తిశ్రద్ధలుగలిగి పరశివచరణారవిందముల నారాధించువాడు నగు మహాదేవుఁడు (రుద్రుఁడు, మహేశ్వరుడు) పరమేశ్వరుని శాసనమును ముందిడుకొని-నాకు ఇహపరశ్రేయస్సు నొదవఁజేయుగాక!

రుద్ర పరివార ప్రార్థన.

తస్య బ్రహ్మ షడంగాని-విద్యేశానాంతథాష్టకం।[125
చత్వారో మూర్తి భేదాశ్చ-శివపూర్వాః శివార్చకాః ॥

శివో భవో హరశ్చైవ-మృడశ్చైవ తథాపరః।[126
శివస్యాజ్ఞాం పురస్కృత్య-మంగళం ప్రదిశంతు మే॥

శంకరుని స్వరూప విభాగములగు సద్యోజాతాది పంచబ్రహ్మలు, హృదయ శిరః కర్ణ నేత్రాదులగు ఆఱు అంగములు, ఎనమండుగురు విద్యేశ్వరులు, శివ భవ హర మృడులు అను నాలుగు రుద్రమూర్తులును పరశివుని పూజించువారు గాన శివాజ్ఞఁబరిగ్రహించి నా యభీష్టశుభము నొసఁగూర్తురుగాక!

విష్ణు ప్రార్థన.

మహేశ్వరుని రెండవరూపము (లేక) శ్రేష్ఠ రూపంబునగు విష్ణు దేవుడు-జలతత్త్వము నధిష్ఠించి అవ్యక్త పదమునందు నెలకొని సాక్షాత్కరించువాడు-

ంథ విష్ణు ర్మహేశస్య-శివస్యైవాపరా (స్యైవ పరా) తనుః । [127
వారితత్త్వాధిపః సాక్షా-దవ్యక్తపద సంస్థితః ॥

నిర్గుణః సత్త్వబహుళ-స్తథైవ గుణకేవలః । [128
అవికారాభిమానీచ-త్రిసాధారణ విక్రియః॥

అసాధారణ కర్మాచ-సృష్ట్యాదికరణాత్ పృథక్ ॥ (129
దక్షిణాంగభవేనాపి-స్పర్ధమానః స్వయంభువా ।

ఆద్యేన బ్రహ్మణాసాక్షా-త్సృష్టః స్రష్టాచ తస్యతు ॥ (130
అంతస్యాంతర్బహిర్వ_ర్తీ-విష్ణుర్లోకద్వయాధిపః ।

అసురాంతకర శ్చక్రీ-శక్రస్యాపి తథాఽనుజః ॥ (131
ప్రాదుర్భూతశ్చదశధా-భృగుశాపఛలా (వశా) దిహ ।

భూభార నిగ్రహార్థాయ-స్వేచ్ఛయాఽవాతరత్‌క్షితౌ॥ (132
అప్రమేయబలో మాయీ-మాయయా మోహయన్ జగత్।

మూ_ర్తింకృత్వా మహావిష్ణుం-సదావిష్ణు మథాపివా॥ (133
వైష్ణవైః పూజితో నిత్యం-మూ_ర్తిత్రయమయాసనే।

శివప్రియః శివాస_క్తః-శివపాదార్చనే రతః ॥ (134
శివస్యాజ్ఞాం పురస్కృత్య-సమే దిశతు మంగళమ్।

ఆకలి దప్పి మున్నగు ప్రాకృత గుణములు లేనివాడు, దివ్యస_త్త్వ గుణపరిపూర్ణుఁడు, మరియు మిశ్రితములు కానట్టి స_త్త్వరజ_స్తమో గుణముల నవలంబించువాడు, నిర్వికారమగు శివరూపమునందు అభిమానము గలవాడు, ముల్లోకములను నిర్మించు సాధారణక్రియ గలవాడు, అవాంతర సృష్టి స్థితిలయములఁజేయు అసాధారణ కర్మగలవాడు, పరమేశ్వరుని కుడి

భుజమునుండి జన్మించినట్టి బ్రహ్మదేవునితో పోటీ చేయువాడు, మహా సృష్ట్యాదిని బ్రహ్మదేవునిచే స్వయముగా పుట్టింపఁబడియు మరల నొక ప్పుడు బ్రహ్మను పుట్టించువాడు, బ్రహ్మాండములోపల బయటను వ్యాపించు వాడు, క్రింది లోకములు పై లోకములు స్వాధీనములుగ నెలకొలుపువాడు నగుటచే విష్ణువనఁబఱఁగువాడు, శివప్రదత్తమైన సుదర్శన చక్రమును కేలఁబూని అసురులఁదునుమాడువాడు, స్వర్గమున దేవేంద్రునికి సోదరుడై ఉపేంద్రుఁడుగ నుండువాడు, భృగుమహర్షిగారి శాపమునకు వశుఁడై (లేక) భృగుశాపము అను నెపమున భూభారమును దింపుటకు తన ఇష్టముతో పది తెఱఁగుల నవతరించువాడు, ఇదమిత్థమని చెప్పనలవిగాని శక్తిసామ ర్థ్యములు గలవాడు, మాయ నధిష్ఠించి తన మాయతో జగమ్మును మోహింపఁ జేయువాడునై మహావిష్ణు (వైకుంఠవాసి మూల) రూపమును ధరించి నిశ్చిం తగా నుండును. సదా విష్ణురూపమున ప్రపంచమును పరిశీలించుచుండును. మూర్తీభవించిన సత్త్వరజస్తమో గుణముల నిండియుండు పీఠముపై పైజ్ఞ వులచే నిత్యము పూజింపఁబడుచుండును.

ఇట్టి మహావిష్ణువు-పరశివునకు ప్రియుడై శివునియందు ఆసక్తి కలవాడై శివుని పాదారవిందములను సహస్రకమలాదుల నర్చించుటలో తత్పరుఁడునై శివాజ్ఞను పరిగ్రహించి నా యభీష్టములగు ధర్మకామార్థముల నొసఁగుగాక!

విష్ణు పరివారమును చక్రాదులను ప్రార్థించుట.

**వాసుదేవో౽ నిరుద్ధశ్చ-ప్రద్యుమ్నశ్చ తతః పరః॥ (135**
**సంకర్షణః సమాఖ్యాతా-శ్చతస్రో మూర్తయో హరేః।**

మత్స్యః కూర్మో వరాహశ్చ-నారసింహోఽథ వామనః ॥
(136

రామత్రయం తథా కృష్ణో-విష్ణు స్తురగవక్త్రకః ।

చక్రం నారాయణస్యాస్త్రం-పాంచజన్యంచ శార్ఙ్గకమ్॥ (137
సత్కృత్య శివయో రాజ్ఞాం-మంగళం ప్రదిశంతుమే ॥

వాసుదేవుఁడు, అనిరుద్ధుఁడు. ప్రద్యుమ్నుఁడు, సంకర్షణుఁడునను నాలుగుమూర్తులు-శ్రీహరివ్యూహ మనఁబడును. అట్టి శ్రీహరిమూర్తులు మరియు మత్స్యకూర్మ వరాహావతారములు, నరసింహస్వామి వామనావతారము, పరశురామ శ్రీరామ బలరాములు, శ్రీకృష్ణమూర్తి, హయగ్రీవావతారంబు సుదర్శనచక్రము, నారాయణాస్త్రము పాంచజన్య శంఖము, శార్ఙ్గధనుస్సు నివి యన్నియు శక్తిశివుల యానతిని ముందిడుకొని నాకు తత్కాలముననే శుభము నొదవఁజేయుగాక!

సరస్వత్యాది ప్రార్థన.

ప్రభా సరస్వతీ గౌరీ-లక్ష్మీశ్చ శివభావితాః ॥ (138
శివయోః శాసనా దేతా-మంగళం ప్రదిశంతు మే ।

ప్రభాదేవి, సరస్వతీదేవి, గౌరీదేవి, లక్ష్మీదేవి యనువారు-శివుని యందు భక్తి కలిగియుండువారు-ఈ దేవేరులు-శక్తిశివుల యుత్తరువు ననుసరించి నాకు శుభము నొనఁగూర్తురుగాక!

ఇంద్రోఽగ్నిశ్చ యమశ్చైవ-నిఋతిర్వరుణ స్తథా॥ (139
వాయుః సోమః కుబేరశ్చ-తథేశాన స్త్రిశూలధృక్ ।

సర్వే శివార్చనరతాః-శివసద్భావభావితాః ॥ (140
సత్కృత్య శివయో రాజ్ఞాం-మంగళం ప్రదిశంతు మే।

దేవేంద్రుఁడు, అగ్నిదేవుఁడు, యమధర్మరాజు, నిఋతి, వరుణుఁడు వాయువు, సోముఁడు కుబేరుఁడు, త్రిశూల ధారియగు ఈశానుఁడు; వీరందరు శివుని పూజించుటలో ఆసక్తిగలవారై శివునియందు సంపూర్ణమైన ఏకాగ్ర నిష్ఠ గలిగియుండువారు. ఇట్టి వీరు శక్తిశివుల యాదేశమును పాటించి నాకు ఇహపరశ్రేయస్సు నొదవఁజేయుదురుగాక!

త్రిశూల మథ వజ్రంచ-తథా పరశుసాయకౌ॥ (141
ఖడ్గపాశాంకుశాశ్చైవ-పినాక శ్చాయుధోత్తమః ।

దివ్యాయుధాని దేవస్య-దేవ్యాశ్చైతాని నిత్యశః॥ (142
సత్కృత్య శివయోరాజ్ఞాం-రక్షాం కుర్వంతుమే సదా ।

త్రిశూలము వజ్రాయుధము, గొడ్డలి, బాణము, కత్తి, త్రాడు (తనుఁగు) అంకుసము, శస్త్రములలో మిన్నయగు పినాకధనుస్సు, ఇవి యన్నియు పార్వతీ పరమేశ్వరులు ధరించునట్టి నిత్యములు దివ్యములునగు

ఆయుధములగునవి. ఇవి యన్నియు శక్తిశివుల యానతిఁబరిగ్రహించి నన్ను రక్షించుగాక!

మహావృషభ ప్రార్థన.

శ్లో॥ వృషరూపధరో దేవః-సౌరభేయో మహాబలః ॥ (143
బడబాఖ్యానలస్పర్ధీ-పంచగోమాతృభిర్వృతః ।

వాహనత్వ మనుప్రాప్త- స్తపసా పరమేశయోః॥(144
తయో రాజ్ఞాం పురస్కృత్య-సమే కామం ప్రయచ్ఛతు।

సురభి యనఁబడు కామధేనువుయొక్క కుమారుఁడు, గొప్పబలము కలవాడు, వృషభరూపమును ధరించినవాడునగు దేవుఁడు-బడబాగ్నితో పోటిచేయుచు ఐదు గోమాతలతో కూడియుండును. ఇట్టి వృషభము-తపో మహిమచే పార్వతీ పరమేశ్వరులకు వాహనమై వారిని సేవించుచుండును గాన శక్తిశివుల యాజ్ఞను పాటించి నాకోర్కె నీడేర్చుగాక!

గోమాతలను ప్రార్థించుట.

శ్లో॥ నందా సునందా సురభిః-సుశీలా సుమనా స్తథా॥ (145
పంచ గోమాతర స్త్వేతాః-శివలోకే ప్రతిష్ఠితాః ।

శివభక్తిపరా నిత్యం-శివార్చనపరాయణాః ॥ (146
శివయోః శాసనాదేవ-దిశంతు మమ వాంఛితమ్ ।

నంద, సునంద, సురభి, సుశీల, సుమనస్సు యను పంచగోమాతలు శివలోకములో నుండునవి. ఇయ్యవి శివభక్తిగలిగి ఎల్లకాలము శివుని పూజించుటయందు ఆసక్తలై యుండును. ఇట్టి గోమాతలు శక్తిశివుల శాసనము ననుసరించి నా యభీష్టమును నెరవేర్తురుగాక!

శివానుచరులను ప్రార్థించుట

శ్లో॥ క్షేత్రపాలో మహాతేజా-నీలజీమూతసన్నిభః ॥ [147
దంష్ట్రాకరాళవదనః-స్ఫురద్రక్తాధరోజ్జ్వలః ।

రక్తోర్ధ్వ మూర్ధజః శ్రీమాన్-భ్రుకుటీకుటిలేక్షణః ॥
(148

రక్తవృత్తత్రినయనః-శశిపన్నగభూషణః ।

నగ్నస్త్రిశూలపాశాసి-కపాలోద్యతపాణికః ॥ (149
భైరవో భైరవైః సిద్ధై-ర్యోగినీభిశ్చ సంవృతః ।

క్షేత్రేక్షేత్రే సమాసీనః-స్థితోయో రక్షకః సతాం॥(150
శివప్రణామ పరమః-శివసద్భావ భావితః ।

శివాశ్రితాః విశేషేణ-రక్షాః పుత్రా ఇవౌరసాః॥
(151
సత్కృత్య శివయో రాజ్ఞాం-సమే దిశతు మంగళమ్।

నీలమేఘకాంతిఁబోలిన మేనువన్నె, గొప్ప తేజస్సుగల క్షేత్రపా లుఁడు- కోఱలతో భయముఁగొలుపు ముఖముతో ఎఱ్ఱని పెదవులు మెఱయు టచే రెట్టింపు శోభించుచుండును. అతని వెంట్రుకలుగూడ రక్తవర్ణములై పైకి లేచియుండును. కనుబొమలు నేత్రములును వంకరగా నుండును. ఎఱ్ఱని మూడు నేత్రములు గుండ్రనివి (వట్టువులు)గ నుండును చంద్రుడు సర్పము-ఆతనికి ఆలంకారములు. ఎల్లకాలము నగ్న (దిగంబరు)డై త్రిశూలమును పాశమును ఖడ్గమును కపాలము (తలపుఱ్ఱె)ను హస్తముల యందుసన్నద్ధములుగా ధరించుచు భైరవుఁడని పిలువఁబడును. అనేకభైర వులుసిద్ధులు యోగినులు-ఆతని చుట్టునుందురు. ప్రతి పుణ్యక్షేత్రమునంద క్షేత్రపాలుఁడై నివసించుచు సత్పురుషులను కాపాడుచుండును. ఆతని శిరస్సు శివుని చరణకమలములపై వంగియుండును. భైరవుఁడు సర్వకా లము శివునియందలి సద్భక్తితో మహిమ గలిగియుండును. శివునికి శర ణాగతులగు భక్తులను కన్నకొడుకులవలె రక్షించుచుండును.

అట్టి భైరవుఁ(క్షేత్రపాలుఁ)డు-శక్తిశివుల యానతిని శిరసావహించి నాకు శుభపరంపరను ప్రసాదించుగాక!

శ్లో॥ తాలజంఘాదయస్తస్య-ప్రథమావరణేఽర్చితాః ॥ (152
సత్కృత్య శివయోరాజ్ఞాం-చత్వారః సమవంతు మామ్।

ప్రథమ (మొదటి) ఆవరణమునందు పూజింపఁబడిన తాలజంఘుఁడు మున్నగు నలుగురు పార్వతీపరమేశ్వరుల యానతిని శిరసా వహించి నన్ను రక్షింతురుగాక!

శ్లో॥ భైరవాద్యాశ్చయేచాన్యే-సమంతాత్తస్య వేష్టితాః॥ (153
తేఽపి మా మనుగృహ్ణంతు-శివశాసన గౌరవాత్ ।

భైరవుఁడు మొదలగువారు మఱియు తదితరులు ఎవరెవరు-పరమశివుని చుట్టు నిలచియుందురో-వారందరుగూడ శివాజ్ఞను గౌరవించి నన్ను అనుగ్రహింతురుగాక!

నారదాదులను ప్రార్థించుట.

శ్లో॥ నారదాద్యాశ్చమునయో-దివ్యాదేవైశ్చపూజితాః ॥ (154
సాధ్యా నాగాశ్చయేదేవా-జనలోకనివాసినః ।

వినిర్వృత్తాధికారాశ్చ-మహర్లోక నివాసినః ॥ (155
సప్తర్షయ స్తథాఽన్యేవై-వైమానికగణైః సహా ।

సర్వే శివార్చనరతాః-శివాజ్ఞావశవర్తినః ॥ (156
శివయో రాజ్ఞయా మహ్యాం-దిశంతు శుభకాంక్షితమ్ ।

అమరులచే అర్చింపఁబడు నారదాది దివ్యమునులు, సాధ్యులు, నాగులు జనలోకనివాసులైన దేవతలు, విశేషాధికారముతో మహర్లోకమునందు నివసించు సప్తర్షులు, మరియు నితర వైమానిక గణములు అందరును శివునారాధించుచు శివాజ్ఞను పాలించువారుగాన వీరు శక్తిశివుల యానతిని నాకు శుభకామన నొసఁగుదురుగాక!

గంధర్వాది దేవజాతివారిని ప్రార్థించుట.

శ్లో॥ గంధర్వాద్యాః పిశాచాంతా-శ్చతస్రో దేవయోనయః ॥ (157

సిద్ధా విద్యాధరాద్యాశ్చ-యేఽపి చాన్యే నభశ్చరాః

అసురా రాక్షసాశ్చైవ-పాతాళతలవాసినః ॥ 158

అనంతాద్యాశ్చ నాగేంద్రా-వైనతేయాదయో ద్విజాః

కూష్మాండాః ప్రేత వేతాలా-గ్రహా భూతగణాః పరే॥ (159

డాకిన్యశ్చాపి యోగిన్యః-శాకిన్యశ్చాపి తాదృశాః

క్షేత్రారామగృహాదీని-తీర్థా న్యాయతనాని చ॥ 160

ద్వీపాః సముద్రా నద్యశ్చ-నదాశ్చాన్యే సరాంసి చ

గిరయశ్చ సుమేర్వాద్యాః-కాననాని సమంతతః॥ 161

పశవః పక్షిణోవృక్షాః-కృమికీటాదయో మృగాః

భువనాన్యపి సర్వాణి-భువనానా మధీశ్వరాః ॥ 162
అండాన్యావరణైః సార్థం-మాసాశ్చ దశ దిగ్గజాః
వర్ణాః పదాని మంత్రాశ్చ-తత్త్వాన్యపి సహాధిపైః ॥ (163
బ్రహ్మాండధారకా రుద్రా-రుద్రాశ్చాన్యే సశక్తికాః
యచ్చకించి జ్జగత్యస్మి న్-దృష్టంచానుమితం శ్రుతం ॥ (164
సర్వే కామం ప్రయచ్ఛంతు-శివయోరేవ శాసనాత్

గంధర్వులు మొదలుకొని దేవపిశాచములవరకు గల నాలుగు దేవజాతులు, సిద్ధులు, విద్యాధరులు మున్నగువారు; తదితరులైన ఖేచరులు. (ఆకాశమందు సంచరించువారు) అసురులు; రక్కసులు; పాతాళమునందు నివసించు అనంతుడు మొదలగు నాగేంద్రులు; గరుత్మంతుడు మొదలగు దివ్యపక్షులు; కూష్మాండులు, ప్రేతములు, వేతాళులు, గ్రహములు ననుభూత (పిశాచ) గణములు; డాకిని యోగినీ శాకినులు; తదితర స్త్రీగణములు; క్షేత్రములు ఉద్యానవనములు, దివ్యభవనములు మున్నగునవి; పుణ్యతీర్థములు; దేవతా మందిరములు, ద్వీపములు, సముద్రములు; నదులు; నదములు; తదితరములగు సరస్సులు, (కొలనులు) మేరువు మునగు పర్వతములు; మరియు అంతట ప్రసరించు అరణ్యములు; పశువులు; పక్షులు; వృక్షములు; కృములు; కీటములు (సామాన్యములైన పురుగులు) మొదలగునవి; వన్యమృగములు; సమస్తలోకములు; లోకాధీశ్వరులు; ఆవరణములతో గూడిన బ్రహ్మాండములు; ద్వాదశ (12) మాసములు, దశ (10) దిగ్గజ

షులు; అక్షరములు; పదములు. మంత్రములు; తమ అధికారులతోకూడిన పృథివ్యాది తత్త్వములు; బ్రహ్మాండమును నిలుపుచుండెడు రుద్రులు; తదితరులైన శక్తి విశిష్టులగు రుద్రులు; ఈ ప్రపంచమున చూడఁబడినది, ఊహింపఁబడినది, వినఁబడినదియునగు వస్తుజాతమున్ను; వీరందరు-శక్తి శివుల యానతి ననుసరించి నా యభీష్టమును నెరవేర్తురుగాక!

మహావిద్యను ప్రార్థించుట.

శ్లో॥ అథ విద్యా పరాశైవీ-పశుపాశవిమోచినీ ॥ 165
పంచార్థ సంజ్ఞితా దివ్యా-పశువిద్యాబహిష్కృతా
శాస్త్రంచ శివధర్మాఖ్యం-ధర్మాఖ్యంచ తదుత్తరం ॥ (166
శైవాఖ్యం శివధర్మాఖ్యం-పురాణం శ్రుతిసమ్మితమ్
శైవాగమాశ్చ యే చాన్యే-కామికాద్యాశ్చతుర్విధాః ॥ (167
శివాభ్యా మవిశేషేణ-సత్కృత్యేహ సమర్చితాః
తాభ్యామేవ సమాజ్ఞాతా-మమాభిప్రేతసిద్ధయే॥ 168
కర్మేద మనుమన్యంతాం-సఫలం సాధ్వనుష్ఠితమ్ ।

పశువును (సంసార పాశబద్ధుఁడైన జీవుని) సంసారము అను

పాశకము (తనుగు) నుండి విడిపించునదియు, ఐదక్షరములకు పంచవిధము లైన అర్థములు కలదియు, దివ్యస్వరూపముగలదియు, పశువిద్యలయందు చేరనిదియు, శివధర్మములగు భస్మరుద్రాక్ష ధారణాదులను నిరూపించుశాస్త్రము, శివధ్యానము మొదలగు లోకోత్తర ధర్మముల నాచరింపఁజేయు శివ యోగశాస్త్రము, శివలీలావిలాసములతో నిండినదియు శివభక్తిని పెంపొందించునదియు శ్రుతిసమ్మతంబునగు శివమహాపురాణ వాఙ్మయము, ధర్మకార్థమా మోక్షములనఁబడు చతుర్విధపురుషార్థములను శివపరములుగా ప్రతిపాదించు శివాగమములును పార్వతీపరమేశ్వరులతో సమానములుగ సత్కరింపఁబడి ఈలోకమున పూజింపఁబడుచున్నవి. ఇవియన్నియు శక్తిశివుల యాజ్ఞఁ గైకొని-నా కోరిక సిద్ధించుటకై-ఈ పూజావిధానమును (లేక) శివమహాస్తోత్ర పారాయణమును అనుమోదించుచు నా యనుష్ఠానమును సఫలం బొనర్చుగాక!

గురు పరంపరా ప్రార్థన.

శ్లో॥ శ్వేతాద్యా నకులీశాంతాః-సశిష్యాశ్చాపి దేశికాః॥ 169
తత్సంతతీయా గురవో-విశేషాత్ గురవో మమ।

శైవా మాహేశ్వరాశ్చైవ-జ్ఞానకర్మపరాయణాః॥ 170
కర్మేద మనుమన్యంతాం-సఫలం సాధ్వనుష్ఠితమ్ ।

శ్వేతాచార్యుఁడు మొదలుకొని నకులీశాచార్యులవరకు గల అష్టావింశతి (28) శివయోగాచార్యులు-ఒక్కొక్కరు నలుగురు శిష్యులు గలవారగుటచే-నూట పన్నెండుగురు శిష్యులతో మొత్తము నూటనలబది (140)

శివయోగులు) మరియు నవ్వారి వంశపరంపరకు చెందిన (ఆరాధ్య) గురువులు, విశేషించి నా వంశ మూలపురుషులనుండి ప్రవర్తించు గురువరేణ్యులును, తదితరులైన కర్మసహితమగు శివజ్ఞానమునందు నిష్ఠగల శివభాగవతులైన మాహేశ్వరులును ఈ నాయనుష్ఠానమును సమర్థించుటయేగాక ఫలప్రదముగ నొనర్తురుగాక!

శ్లో॥ లౌకికా బ్రాహ్మణాః సర్వే-క్షత్రియాశ్చ విశః క్రమాత్॥ (171

వేదవేదాంగ తత్త్వజ్ఞాః-సర్వశాస్త్రవిశారదాః ।

సాంఖ్యా వైశేషికాశ్చైవ-యోగానైయాయికా నరాః ॥ (172

సౌరా బ్రాహ్మాస్తథా రౌద్రా-వైష్ణవాశ్చాపరే నరాః ।

శిష్టాః సర్వే విశిష్టాశ్చ-శివశాసన యంత్రితాః ॥ 173

కర్మేద మనుమన్యంతాం-మమాభిప్రేత సాధకమ్ ।

లోకవ్యవహారమునకు ఉపయోగించు సాధారణ బ్రాహ్మణోత్తములు, ప్రజాపాలన తత్పరులగు క్షత్రియశ్రేష్ఠులు, ధర్మన్యాయముల ననుసరించు వైశ్యపుంగవులు, వేదవేదాంగములయొక్క సారాంశమును గుర్తించి శాస్త్రముల నన్నిటి నభ్యసించిన-పండిత ప్రకాండులు, ప్రకృతి పురుషులను విడివిడిగా భావించు సాంఖ్యులు, సప్తపదార్థములను నిరూపించు తార్కి-

కులు, చిత్తవృత్తి నిరోధకమగు యోగము నుప్రతిపాదించువారు, న్యాయ (తర్కవిశేష) వాదులు సూర్యోపాసకులు, బ్రహ్మోపాసకులు, కైలాస రుద్రోపాసకులు, విష్ణుభక్తులు, తదితరులైన శిష్టులు, (సదాచార సంపన్నులు) కులశీల సద్గుణములచే గౌరవనీయులైనవారు, [విశిష్టులు] శివాజ్ఞకు లోబడినవారై నా ఈ స్తోత్రపఠనము నామోదించుచు నా యభీష్టమును సాధించుదానిగా నొనర్తురుగాత!

శ్లో॥ శైవాః సిద్ధాంతమార్గస్థాః-శైవాః పాశుపతాస్తథా॥ (174

శైవా మహావ్రతధరాః-శైవాః కాపాలికాః పరే।

శివాజ్ఞాపాలకాః పూజ్యా-మమాపి శివశాసనాత్॥ 175

సర్వే మా మనుగృహ్ణంతు-శంసంతు సఫలాం క్రియామ్ ।

విశిష్ట శివాద్వైత సిద్ధాంతమార్గము నంగీకరించి శివునుపాసించువారు, శివానుగ్రహమువలననే సంసారపాశవిముక్తి నపేక్షించుచు శివునారాధించు పాశుపతులు, ఆజన్మాంతము లింగధారణాది మహావ్రతము నవలంబించి శివు నర్చించువారు.... కపాలభిక్షాజీవనులై మహేశ్వరునివలె ప్రవర్తించు వారు, వీరందరును నాకును పరమపూజ్యులగుటయేగాక నా యీ శుభచేష్టితము ఫలించునని ఘోషింతురుగాక!

శ్లో॥ దక్షిణజ్ఞాననిష్ఠాశ్చ-దక్షిణోత్తరమారగాః ॥ 176
అవిరోధేన వర్తంతాం-మంత్రశ్రేయోఽర్థినోమమ ।

వామమార్గము దక్షిణమార్గమునని శివోపాసనము రెండు విధములగును. కాపాలికాదులు శైవులైనను మద్యమాంసాది నిషిద్ధ వస్తుసేవనముచే వామమార్గులనఁబడుదురు వేద శివాగమ ప్రోక్తమగు దక్షిణమార్గము నవలంబించి శివోపాసనయందు నిష్ఠగల సాత్త్వికులు, దక్షిణమార్గ పర్యావసానమగు శివధ్యానమునందు పరిపూర్ణులగు శివయోగులును నా యనుష్ఠానమునందు వ్యతిరేకభావము లేనివారై శివమహాస్తోత్రమును తదంగమగు శివ పంచాక్షరీమంత్రమును జపించుటవలన కలుగు శ్రేయస్సు నొదవఁజేయుదురుగాక!

శ్లో॥ నాస్తికాశ్చ శఠాశ్చైవ-కృతఘ్నాశ్చైవ తామసాః ॥ (177
పాషండాశ్చాతిపాపాశ్చ-వర్తంతాం దూరతో మమ ।

వేదాలు శాస్త్రములు పురాణేతిహాసాదులు కల్పితములనియు, పుణ్యపాపములు పరలోకములు లేవనియు వాదించు నాస్తికులు, ఇతరులు చెప్పు హితవాక్యములు మంచివని తోచినను దురహంకారముచే నంగీకరింపని శఠులు, ఇతరులు చేసినమేలు మఱచు కృతఘ్నులు, తమోగుణముచే అలసులగువారు, జైన బౌద్ధాది వేద బాహ్యమతముల నవలంబించు పాషండులు, బ్రహ్మహత్యాది మహాపాపముల నొనర్చిన దురితాత్ములు, వీరందరు నాకు దూరముగ నుందురుగాక!

శ్లో॥ బహుభిః కింస్తుతై రత్ర-యేఽపి కేఽపి చిదాస్తికాః ॥
సర్వే మా మనుగృహ్ణంతు-సంతః శంసంతు మంగళమ్।

ఈ స్తోత్రమున చెపఁబడినవారుగాక ఇతరులు పెక్కురు నుతింపఁ దగినవారున్న నవ్వారిని ప్రత్యేకించి పొగడుట యేందుకని భావించుచు-నాస్తికులలో ఆస్తికులుగా మారిన మహాపురుషులెవరున్న నట్టి సత్పురుషు లందరు నాపైదయ గలవారై నాకు ఎల్లకాలము శుభము కలుగునట్లు ఆశీర్వదింతురుగాక!

పరశివవందనము.

శ్లో॥ నమః శివాయ సాంబాయ-ససుతాయాది హేతవే॥ 179
పంచావరణరూపేణ-ప్రపంచేనావృతాయతే ।

అంబ (ఆదిశక్తి)తో నిరంతరము కూడియుండువాడు, కుమారగణేశాదితనయులకు నిత్యము సన్నిహితుడై యుండువాడు, జగత్కారణము లగు శక్తి హరి బ్రహ్మాదులకునుకారణమగుటఁజేసి ప్రప్రథను (మొట్టమొదటి) జగత్కారణమగువాడు, ఐదు ఆవరణముల యందుండు పరివార దేవతలచే నిండియుండు ప్రపంచమునందు గుప్తమగువాడునగు (సాంబ) శివునకు వందనము.

అనగా? శక్తి విశిష్టమగు పరబ్రహ్మమే పరశివతత్త్వమనియు, ఈ స్తోత్రాంతమున "నమఃశివాయ" అని చెప్పుటచే-వేదశాస్త్రపురాణాది

సంస్కృత వాఙ్మయమునకు మూలము శివపంచాక్షరీ మహా మంత్రమనియు, శక్తిరహితము నిర్గుణంబునగు తత్త్వము-పరబ్రహ్మము కాదనియు. స్తోత్రపాఠము, స్తోత్రమునందు చెప్పఁబడిన శివారాధనంబు-పరాభక్తిరూపమగు జ్ఞానమునకు నిదానములగుననియు గుర్తించవలెను. శుష్కజ్ఞాన చర్చతో శివజ్ఞానము పరిపుష్టముకాదుగాన శివభక్తితో శివునుపాసించి తరించుటకు-సద్గురువద్ధ స్వీకరింపఁబడు శివపంచాక్షరీ మహామంత్రమును జపించుట-శివమహాస్తోత్రపఠనంబు ఆవశ్యకములని విదితమైనది.

శ్లో॥ ఇత్యుక్త్వా దండవద్భూమౌ-ప్రణిపత్య శివం శివాం॥ (180

జపేత్ పంచాక్షరీం విద్యా-మష్టోత్తర శతావరామ్।

ఇట్లు ఈస్తోత్రమును చదివి "శక్తిశివులు ఎదురు ఉన్నారని" భావించుచు దండమువలె నేలపై సాగిలపడి (సాష్టాంగ నమస్కారముఁ జేసి) 108 సంఖ్యకు తక్కువ గాకుండా శివపంచాక్షరీ విద్యను జపించవలెను.

శ్లో॥ తథైవ శక్తి విద్యాంచ-జపిత్వా తత్సమర్పణం॥ (181

కృత్వా తం క్షమయిత్వేశం-పూజాశేషం సమాపయేత్।

అటులనే శక్తి (హ్రీం నమఃశివాయ) విద్య (మంత్రము)ను 108 పర్యాయములు జపించి-శక్తి శివమంత్ర జపములను శివచరణారవిందముల

యందు సమర్పించి పరశివుని(గూర్చి క్షమాపణమును వేడుకొని-పూజా విధానమును ముగించవలెను.

ఫలశ్రుతి

శ్లో॥ ఏతత్ పుణ్యతమం స్తోత్రం-శివయోర్హృదయంగమం॥ 182
సర్వాభీష్టప్రదం సాక్షాత్-భుక్తిముక్త్యేక సాధనమ్।

ఈ శివమహాస్తోత్రము- అత్యంత పవిత్రమై పార్వతీవరమేశ్వరుల దివ్యమనస్సులను రంజింప(జేయునట్టిది. మరియు పాఠకులకు సమస్త వాంఛితము (కోరిక)ల నిచ్చుటయేగాక జీవితకాలమున భుక్తిని, అంత్య కాలమున ముక్తికిని ఒకే ఒక సాక్షాత్ (ప్రత్యక్ష) సాధనంబు నగునది.

శ్లో॥ యఇదం కీర్తయేన్నిత్యం-శృణుయాద్వా సమాహితః॥ 183
స విధూయాశు పాపాని-శివసాయుజ్య మాప్నుయాత్ ।

శివసాయుజ్య(మోక్ష) మునకు శివస్తోత్రపాఠాదులతో శివునారాధింప వలసియుండును. ఇందుకు జన్మజన్మాంతరార్జితములగు దురితములు అడ్డు వచ్చును. ఇట్టి ప్రతిబంధక పాపములు వడివడిగా పటాపంచలగుటకు-ఈ మహా స్తోత్రమును ప్రతిదినము-స్నానసంధ్యాద్యనంతరము-ఏకాగ్ర చిత్త మున నెవరు (స్త్రీగాని పురుషు(డుగాని) చదువుదురో, (లేక) ఇతరులు

చదువునపుడు వినెదరో అట్టివారు ఈ జన్మయందే పాపనిర్ముక్తులై శివ సాయుజ్యము నందుదురు.

శ్లో॥ గోఘ్నశ్చైవ కృతఘ్నశ్చ-వీరహా భ్రూణహాపి వా॥ 184
శరణాగత ఘాతీ చ-మిత్ర విశ్రంభఘాతకః।
దుష్టపాపసమాచారో-మాతృహా పితృహాపి వా॥ 185
స్తవేనానేన జప్తేన-తత్తత్ పాపాత్ ప్రముచ్యతే।

గోహంతకుడు; చేసినమేలు మఱచు కృతఘ్నుడు; వీరపురుషుని చంపువాడు; గర్భస్థ శిశువును హింసించువాడు; శరణాగతులగు (నీ వే దిక్కని ఆశ్రయించు) వారిని బాధించువాడు; స్నేహితులను నమ్మించి పీడించువాడు; దుర్మార్గము పాపభూయిష్టం బునగు ప్రవర్తనము (నడత గలవాడు; మాతృ హంతకుడు; పితృహంతకుడు ఇట్టి పాపాత్ములందరు నీ స్తోత్రమును పఠించినను విన్నను ఆయా పాపముల నుండి తత్కాలము ననే విడుదలజెందుదురు.

సమస్తపాపములకు ప్రాయశ్చిత్తము-ఈ స్తోత్రపాఠం బని సారాంశము

శ్లో॥ దుఃస్వప్నాది మహానర్థ-సూచకేషు భయేషు చ॥ 186
యది సంకీర్తయే దేత-న్నతతోఽనర్థభాక్ భవేత్।

దుఃస్వప్నము (చెడుకల)లు మున్నగు గొప్ప సంకటములను సూచించు భయములు తారసిల్లినపుడు-ఈ శివమహాస్తోత్రమును చదివిన యెడల-అట్టి అనర్థములు తొలగిపోవును.

శ్లో॥ ఆయురారోగ్య మైశ్వర్యం-యచ్చాన్యదపి వాంఛితం ॥ 187
స్తోత్రస్యాస్య జపే తిష్ఠం-స్తత్సర్వం లభతే నరః।

దీర్ఘాయుష్యము, శరీరారోగ్యము, ఎడతెగని సంపద, కోరినదంతయు ఈ స్తోత్రపారాయణము నొనర్చువారికి తప్పక లభించును.

శ్లో॥ అసంపూజ్య శివంస్తోత్ర-జపాత్ ఫల ముదాహృతం॥ 188
సంపూజ్య చ జపే తస్య-ఫలం వక్తుం న శక్యతే।

,, స్తోత్రమాత్రం శుచిర్భూత్వా-యఃపఠే త్సుసమాహితః ॥ 189
సోఽప్యభీష్టతమా దర్థా-దష్టాంశం ఫల మాప్నుయాత్।

,, అథతస్యానుసంధాయ-పర్వణ్యనశనః పఠేత్॥ 190
అష్టమ్యాంచ చతుర్దశ్యాం-ఫలమర్ధం సమాప్నుయాత్ ॥

శ్లో॥ యస్త్వర్థ మనుసంధాయ-పర్వాదిషు యథా వ్రతీ।
మాస మేకం జపేత్‌స్తోత్రం-స కృత్స్నం ఫల
మాప్నుయాత్॥ 191

శివుని పూజింపక నీ స్తోత్రమును చదువువారికి పూర్వోక్తమగు ఫలము సనుకూరును. ఇఁక శివుని పూజించి స్తోత్రపాఠము నొనర్చినచో ఎంత ఫలము చేకూరునో చెప్పనలవిగాదు. అనగా? రుద్రాభిషేకాదులతో పంచాపరణ పద్ధతిని శివుని పూజించి స్తోత్రముఁ జదువువారికి అనంత ఫలము సంప్రాప్తించునని భావము.

ఒకవేళ శివుని పూజించుటకు వీలుపడనిచో-పరశుద్ధుఁడై స్తోత్రమును మాత్రము స్థిరచిత్తమున పఠించునెడ తాముకోరిన ఫలములో ఎనిమిదవవంతు ఫలము నొందుదురు. పరమేశ్వరుని మనసునందిడుకొని సోమవారము, మాసశివరాత్రి, మహాశివరాత్రి, అష్టమి, చతుర్ధశి మొదలగు పర్వకాలములలో ఉపవాసదీక్షతో ఈ స్తోత్రమును చదువువారికి-సగము ఫలము సమకూరును. స్తోత్రముయొక్క అర్థమును మనసునందు నిలుపుకొని పర్వకాలములయందు నియమముతో నెలరోజులు స్తోత్రపారాయణమును చేయువారు-సంపూర్ణఫలమును పొందగలరు.

శ్లో॥ ఆస్తా మియం ఫలావాప్తి-రస్మిన్ సంకీర్తితే సతి।
సార్థ మంబికయా దేవః-శ్రుత్వైవ దివి తిష్ఠతి॥ 192

,, తస్మా న్నభసి సంపూజ్య-దేవదేవం సహోమయా।
కృతాంజలి పుట స్తిష్ఠ-స్తోత్రమేత దుదీరయేత్॥193

ఇంతవరకు చెప్పఁబడిన ఫలప్రాప్తిని అటుండనిండు! ఈ స్తోత్రమును భక్తిశ్రద్ధలతో పఠించినయెడల పార్వతీదేవితోగూడ పరమేశ్వరుఁడు-ఆకాశమునందు ఈ స్తోత్రమును వినుచుండును.

అందువలన ఆకాశమువైపున ఉమామహేశ్వరులను పూజించి దోసిలి ఒగ్గినవాడై నిలువఁబడి ఈ స్తోత్రమును పఠించవలెను.

ఈ స్తోత్రపాఠము, పంచావరణ శివారాధనంబు-శివయోగములో శ్రేష్ఠమైనది గాన దీనికి మించిన శివప్రీతి సాధనము-మరియొకటి లేదని తెలియవలెను. దీనితో సాధింపరాని దేదియు లేదు. కోర్కెల నన్నిటిని పొందవచ్చునని భావము. చిన్న చిన్న ఫలితములకొరకై దీని నుపయోగింపరాదు శివునుద్దేశించి స్తోత్రముఁ జదువుచు చిన్న కోరికనైనను పెద్దకోరికనైనను పొందవచ్చును

కావున ఏ పుణ్యమునైనను శివప్రీత్యర్థమే చేయుట శ్రేయస్కరమగును. శత్రువుల నోడించుటకు అపమృత్యువులను తొలగించుకొనుటకు ఇహలోకఫలమునకై పరలోకసుఖమునకై మహాపాతక నివృత్తికి మహారోగశాంతికై దుర్భిక్షము దూరమగుటకును ఈ స్తోత్రపాఠము ఉపయోగించును. ఇద్ది మహాశివయోగమని చెప్పఁబడును. పెద్దపెద్ద ఆపదలను నివారించుటకై మహేశ్వరుఁడు ఈ స్తోత్రపాఠమును తన పరమాస్త్రము (ఆయుధము)గా భక్తులకు ప్రసాదించినవాడు తనను రక్షించు సాధనములలో దీనిని మించినది లేదు.

ఆ జన్మాంతము ప్రతిదినము స్నానసంధ్యాద్యనంతరము ఈ స్తోత్రము చదువుచు శివానుగ్రహపాత్రుడై భుక్తిముక్తుల నొందనగును. స్తోత్రపాఠమునకు తోడుగా శివపంచాక్షరీ మహామంత్రజపమును కనీసం అష్టోత్తర సహస్ర (1008) పర్యాయములు జపించుట ఉత్తమమార్గంబగును.

శివస్తోత్ర మిదం శంభోః-కృపయాఽనువాదితం ।
ముద్రాపితం శైవచిత్త-రంజనార్థం మయాఽధునా॥

స్వకీయ గ్రంథజాతేతు-గ్రంథోఽయ మేకత్రింశకః ।
శివోహ్యేతత్ గృహీత్వా వై-కంఠహారస్య మధ్యతః ॥

మణిం ధరతు సుప్రీత్యా-కరోతు ధన్యజన్మకం ।



★

శ్రీ కస్తూరి బొర్రమల్లయ్యగారు-బాల్యమునుండి సత్పురుషుల సహవాసముతో సత్ప్రవర్తనము నలవరచుకొని యౌవనమున వ్యాపారదక్షులై అతిథి అభ్యాగతులను దానధర్మమర్యాదలతో సత్కరించుచు-గీతాపారాయణముఁజేయుచు జ్ఞానాభివృద్ధులై నిత్య సంధ్యావందన జపములను ఇష్టదేవతార్చన నొనర్చుచు బోథ్ గ్రామములో ప్రముఖులై యున్నవారు.



**శ్రీయుత కత్తూరి బొర్రమల్లయ్య-వలదు శ్రీరాములుగారు,**
**కీ॥ శే॥ సౌభాగ్యవతి, కత్తూరి రాజుబాయిగారు (దంపతులు)**

గోత్రం-మిథునకుల, వృత్తి వ్యాపారము.
నివాసము-బోథ్ (తాలూకా) ఆదిలాబాదు జిల్లా, ఆం ప్ర.

---

వీరు నాతో విరోధికృత్ సం॥వ మహారుద్రయాగమును మహాకైలాసపూజనము గ్రామప్రముఖులనందరిని సంప్రదించి చేయించిరి. వీరికి కొన్ని వత్సరముల్కిృతం స్వధర్మ పత్నియగు రాజుబాయి దివంగతురాలగుట యొకటియే కొఱతయైనది. ఈ పుణ్యదంపతులకు- 1 భాస్కర్ 2 కీ॥ శే॥ సుదర్శన్, 3 డాక్టర్ ప్రకాశ్, 4 అశోక్, 5 కృష్ణ, 6 రమేశ్ అను ఆరుగురు కుమారులు, శ్రీమతులు- 1 సింధు, 2 చంద్రకళ, 3 కీ॥ శే॥ రత్నమాల, 4 జయమాల, 5 విద్య అను ఐదుగురు కుమార్తెలు కలిగిరి.

వీరి సంతానముతో వంశము బహుళసంఖ్యాకమై తనరారుచున్నది. కుమారులందరు (ప్రస్తుతం ఐదుగురు) బుద్ధిమంతులు దేవతాగురుభక్తి పరాయణులునై స్వకళత్ర పుత్రాదులతో సుఖమయ కుటుంబజీవనమును సాగించుచున్నవారు, వీరు-తమ ఐదవకుమారుడగు శ్రీ కృష్ణగారిద్వారా ఈ గ్రంథమునకు విశేషవిరాళమును సమర్పించిరి గాన వీరందరిని పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్యభాగ్యముల నొసగుచు ఎల్లకాలము రక్షించుగాక!

నిర్మల శంకరశాస్త్రి